# THE ANDHRA PRADESH LEGISLATIVE ASSEMBLY DEBATES

[*Part II—Proceedings other than Questions and Answers*]

## OFFICIAL REPORT

---

*Tenth Day of the Sixth Session of the Andhra Pradesh Legislative Assembly*

---

## ANDHRA PRADESH LEGISLATIVE ASSEMBLY

*Thursday, the 7th November,* 1957

**The House met at Half Past Eight of the Clock**

[MR SPEAKER IN THE CHAIR]

## QUESTIONS AND ANSWERS

(SEE PART I)

## BUSINESS OF THE HOUSE

మిస్టర్ స్పీకర్  Absentee members' questions విషయంలో Rule 56 క్రింద ప్రశ్న అడగవలసిన మెంబరు లేకపోతే ఇంకొక ఏ మెంబరు అయినా లేచి ఆ ప్రశ్న అడగవచ్చును అని ఉన్నది కన్వెన్షన్ ప్రకారం. ఆ ప్రాంతానికి సంబంధించినవారుగాని, ఆ సమస్యకు సంబంధించిన వారుగాని అడగవచ్చును ఇది పూర్వంనుంచి ఉన్నదే కాబట్టి, ఇప్పుడు దీనిని సవరించవలసిన అవసరం లేదు.

**"If at the time of putting a question on a motion to the vote of the Assembly, the Mover of the motion is absent, it shall be considered to have been withdrawn by him unless any Member of the Assembly asks that the question . . . . ."**

కాబట్టి ఆ హక్కు ఉన్నది కాని ఎవరైనా సభ్యులు తాము ఆలస్యంగా వస్తామని చెబితే తప్ప, క్వశ్చన్ను పోస్టుపోన్ చేసి లాభంలేదు. "If there is time.... ............" అని ఉంది కాబట్టి అది అంగీకరించాలని కోరుతున్నాను.

ముఖ్యమంత్రి (శ్రీ యన్. సంజీవరెడ్డి) అధ్యక్షా, రూలు 57 ఇన్‌ఎఫెక్టివ్ అయిపోతుందే అని చూస్తున్నాను I have absolutely no objection, Sir But the purpose of Rule 57 will become useless If it is so ineffective, I request you, Sir, to examine and get it deleted from the Rules

మిస్టర్ స్పీకర్ చూస్తాం

శ్రీ పి. రంగారెడ్డి (గిద్దలూరు) అధ్యక్షా, ఒక విషయం నేను చెబుతాను మొదట ప్రశ్నలు వచ్చినపుడు, వాటికి సంబంధించిన సభ్యులు సభలో లేక పోయినపుడు, అప్పుడే ఇంకొక సభ్యుడు ఆ ప్రశ్నలు వేయకుండా, అటువంటి ప్రశ్నలన్నీ ఆఖరున తీసుకొంటే బాగుంటుంది మొదట ఒక ప్రశ్న వచ్చినపుడు, ఆ ప్రశ్నకు సంబంధించిన సభ్యులు అప్పుడు లేకపోవచ్చును కొద్దిసేపటికి ఆ సభ్యులు రావచ్చును ప్రశ్నలు వేసినవారికే ఆ ప్రశ్నలకు సంబంధించిన ఇన్ఫర్మేషన్ తెలిసిఉంటుంది మొదట హాజరులో ఉన్నటువంటి సభ్యుల ప్రశ్నలు తీసుకొంటే, తరువాత హాజరు గానటువంటి మెంబర్సు ప్రశ్నలు తీసుకోవచ్చు. అటువంటి ప్రశ్నలు ఆఖరున తీసుకోండి అప్పటికి ఆ సభ్యుడు వస్తే వస్తాడు ఆయన రాకపోతే, మరొక సభ్యుడు ఆ ప్రశ్న వేస్తే, ఆన్సర్ చేయటానికి వీలుంటుంది ఆవిధంగా మనం అనుసరిస్తే బాగుంటుంది

మిస్టర్ స్పీకర్ • ఇందులోకూడ చిక్కులు ఉన్నాయి ఆఖరున ప్రశ్నలు తీసుకోటానికి టైము ఉండదు వ్రాతపూర్వకమైన అథారటీ కావాలని అనకుండానే ఇంతవరకు ఎవరోఒకరికి ప్రశ్నలు వేసే అవకాశం ఇవ్వటం జరిగింది అందుచేత యీ విషయంగురించి కొంచెం ఆలోచిద్దాము ప్రస్తుతం కానివ్వండి. దీని విషయం రూల్సు కమిటీలో చూసుకొందాము

శ్రీ షేక్ మౌలాసాహెబ్ (ఉదయగిరి) అధ్యక్షా, మంత్రిగారు లేని కారణంచేత ఏ వ తేదీ ప్రశ్నలు మిగిలిపోయాయి. అవి ఎప్పుడు తీసుకొంటారో చెబుతారా ?

మిస్టర్ స్పీకర్ . అవి తర్వాత వస్తాయి నిన్న ఇంకొక విషయం జరిగింది "పటాస్కర్ రిపోర్టు చర్చ విషయంలో బిజినెస్ ఎడ్వయిజరీ కమిటీలో ఇంకా మేము నిర్ణయంచేయలేదు ; దానిని గురించి ఆలోచించి, ఇక్కడ తీసుకురావ టానికి చూస్తాము" అని అన్నదానికి ముగ్గురు మెంబర్సు ప్రొటెస్టుగా బయటకు వెళ్లిపోయారు. అది మంచిదికాదని మాత్రమే నేను చెబుతున్నాను. అయితే అది డిసిప్లినరీ యాక్షన్ క్రిందకు వస్తుందని చెప్పను. తిరుత్తనిగురించి మన చీఫ్ మినిష్టర్ గారు చాలా యాంక్షస్‌గా ఉన్నారు. ఈపరిస్థితిలో సభ్యులు

ప్రొటెస్ట్‌చేస్తే పబ్లిక్ దృష్టిలో బాగుండదు అది నా సలహా అంతకుతప్ప నేను చెప్పేదిలేదు ముఖ్యంగా ఇంకో విషయం ఉన్నది అది చాలా సీరియస్ మేటర్ నిన్న ఒంటిగంట వరకు ఫుడ్‌సిట్యుయేషన్ మీద చర్చ జరగాలని బిజినెస్ ఎడ్వయిజరీ కమిటీలో నిర్ణయించారు, మెంబర్సు మాట్లాడిన తర్వాత, 12 గంటలకు లీడర్ ఆఫ్ ది అపోజిషన్ మాట్లాడాలని, 12½ మంత్రిగారు రిప్లయి చెప్పాలని నిర్ణయించుకొన్నాము అటువంటప్పుడు మెంబర్సు లేచి "మమ్మల్ని మాట్లాడనివ్వండి, మమ్మల్ని మాట్లాడనివ్వండి" అంటే, దానికి నేను వీలులేదని చెబితే, దానిమీద ప్రొటెస్ట్‌చేసి బయటకు వెళ్లిపోవటం సబబుకాదు

ఎందుకంటే, సభ్యులు కూర్చోమంటే కూర్చోవాలి ఏ ఆర్డర్‌లో పిలిస్తే ఆ ఆర్డర్ ప్రకారం మాట్లాడటానికి లేవాలిగాని "నన్ను పిలుస్తారా, లేదా, నేను మాట్లాడుతాను" అని అడగటం, నేను వీలులేదంటే ప్రొటెస్ట్‌చేసి బయటకు వెళ్లిపోవటం—ఇది చాలా సీరియస్ మేటర్ టైము ఉంటే, సభ్యులు మాట్లాడటానికి నేనుఅభ్యంతరం పెట్టను ఇంకోరోజునచీఫ్‌విప్ గారిచేతముందుగానే వారి పేరు వేయించుకోవచ్చును అంతేతప్ప "నన్ను పిలుస్తారా, పిలవరా పిలవకపోతే నేను ప్రొటెస్ట్ చేస్తాను" అని చెప్పటం—it is a serious breach of privilege of the Speaker వారు ఇది తెలియకుండా చేశారు కనుక, క్షమిస్తున్నాను వార్నింగ్ ఇస్తున్నాను ఇకముందు అలా చేయకూడదని మాత్రం సభ్యులకు మనవి చేస్తున్నాను. Because it is serious indiscipline and contempt of the Speaker

**శ్రీ వి కోదండ రామరెడ్డి (సర్వేపల్లి).** అధ్యక్షా, ఇప్పుడు తమరు చెప్పిన రూలింగ్ బాగున్నది కాని సభ్యులు ఎవరెవరు మాట్లాడ దలచుకొంటారో, వారందరికీ కొద్దిగానైన అవకాశం ఇస్తే బాగుంటుందని నా సలహా.

**శ్రీ యస్. సంజీవరెడ్డి** అధ్యక్షా, అందరికి మాట్లాడటానికి అవకాశం యివ్వటం సంభవంకాదు చాలామందికి మాట్లాడవలెననే అభిప్రాయం ఉంటుంది కాని వారందరూ మాట్లాడటానికి టైము ఉండదు అంతటితోనే మాట్లాడలేని వారందరూ బయటకు పోతామంటే, అది సరైందికాదు ఈ విషయంలో మీరువెల్లడించిన సెంటిమెంట్స్‌కో నేనుపూర్తిగా ఏకీభవిస్తున్నాను ఈ సభను ఇతరులెవరైనా చూసినవ్వే పరిస్థితిలో పెట్టకుండా, కొంచెం డిగ్నిఫైడ్‌గా పెట్టుకొంటే మంచిది చిన్నదానికి పెద్దదానికి వాకవుట్ చేసుకోవటంలో మన సభకుగాని, మనకు గాని గౌరవం కాదని, మీరు చెప్పిన దానిని నేను సంపూర్ణంగా బలపరుస్తున్నాను.

**మిస్టర్ స్పీకర్** కాబట్టి సభ్యులు విప్‌ద్వారా తమ పేర్లు పంపించండి ఆ ప్రకారం చూస్తాను. మీకు పార్టీస్ ఉన్నాయి. గ్రూప్స్ ఉన్నాయి మిని

మమ్ కోరమ్ ఉన్నదే పొలిటికల్ పార్టీ అన్నది కన్వెన్షన్, తక్కినవి గ్రూప్స్ అవుతాయి I want to co-operate with you, and the Members have to co-operate with me I am so helpless in the matter The party whips are there and the Members can give their names through the whips కాబట్టి మనం ఆంధ్రప్రదేశ్ అసెంబ్లీ చాలా గౌరవంగా ఉన్నదనే ఖ్యాతి తీసుకురావలసి ఉన్నది

శ్రీ ఈ. గూరుచిన్నప్ప (మహబూబ్‌నగర్) అధ్యక్షా, పాయింట్ ఆఫ్ ఇన్ఫర్మేషన్ సర్, మంత్రిగారు లేకపోయినపుడు జవాబు చెప్పబడకుండా ఆగిపోయిన ప్రశ్నలు యీ సమావేశంలోనే వస్తాయా ?

మిస్టర్ స్పీకర్ వస్తాయి

## CALLING ATTENTION TO URGENT MATTERS OF PUBLIC IMPORTANCE RE NON-PAYMENT OF BONUS TO THE SUGARCANE GROWERS

మిస్టర్ స్పీకర్ రూలు 74 క్రింద గౌరవసభ్యులు శ్రీనివాసరావుగారు యీ విధంగా నోటీసు యిచ్చారు

**"I wish to call the attention of the hon Chief Minister, under Rule 74 of the Assembly Rules, for the non-payment of bonus to the sugarcane growers of the Nizam Sugar Factory area for the last three years, 1954-55, 1955-56 and 1956-57, and the bonus to the workers of the factory"**

దీనినిగురించి గౌరవనీయులైన ముఖ్యమంత్రిగారిని చెప్పవలసినదిగా కోరుతున్నాను.

***Sri N Sanjeeva Reddi*** **Sir, It is almost a surprise to me**

అది ఒక కంపెనీ అక్కడి కూలిలకుఏదో ఒకపద్ధతి ఉంటుంది ఆ కంపెనీకి చీఫ్ మినిస్టర్ కు ఏమి సంబంధమో అర్థంకాదు ఆ కంపెనీకి ఉత్తరువు యిచ్చే అధికారం ప్రభుత్వానికి లేదు, ప్రభుత్వానికి కొన్ని షేర్సు ఉండవచ్చు. ప్రభుత్వముతరపున కొందరు డైరెక్టర్సు ఉన్నారు ఇక్కడనుండి ఉత్తరువు పంపించే అధికారం ప్రభుత్వానికి లేదని మనవిచేస్తున్నాను. అక్కడ ఏమైనా లోట్లు ఉంటే, మన ప్రతినిధులద్వారా, మన రిప్రజెంటేటివ్స్‌ద్వారా న్యాయం జరిగేటట్లు చేయించవచ్చును ఇంతకన్నా ఎక్కువ చెప్పకలిగింది లేదు.

## ANNOUNCEMENT BY THE CHAIR RE ELECTIONS TO THE ZONAL RAILWAY USERS CONSULTATIVE COMMITTEES

మిస్టర్ స్పీకర్ 1) Zonal Railway Users Consultative Committee For South Estern Railway లో సభ్యత్వమునకు మనఎసెంబ్లీ సభ్యులు ముగ్గురు నామినేషన్సు దాఖలు చేశారు వీరి పేర్లు శ్రీ కె పున్నయ్య, శ్రీ ఎరుకు నాయుడు, శ్రీ శీర్ల బ్రహ్మయ్యగార్లు, ఈ ముగ్గురిలో బ్రహ్మయ్యగారు withdraw చేసుకున్నారు మిగిలిన యిద్దరు పోటీ చేస్తున్నారు ఈ పోటీలో ఎన్నిక కొరకు election తేది యీ నెల 11 వ తేది నిర్ణయించాను, ఆ రోజున ఎన్నిక జరుగుతుంది

2) సెంట్రల్ రైల్వేకు గాను ఇద్దరు సభ్యులు నామినేషన్లు దాఖలు చేశారు వారి పేర్లు శ్రీ బి సత్యనారాయణ, శ్రీ కె యల్ నరసింహారావు వీరిద్దరిమధ్య పోటీ జరుగుతుంది ఈ election కు యీ నెల 12 వ తేది నిర్ణ యించాను గనుక election ఆ తేదిన జరుగుతుంది

3) Southern Railway కు గాను ఇద్దరు సభ్యులు నామినేషన్లు దాఖలు చేశారు. వారిపేర్లు, బి పి శాసారెడ్డి, (2) జి యల్లమందారెడ్డి ఈ ఇద్దరు సరైన అభ్యర్థులుగా నిర్ణయించబడ్డారు ఈ ఇద్దరికిమధ్య పోటీ జరుగుతుంది. Election కు యీ నెల 13వ తేది నిర్ణయించాను గనుక election ఆ తేదీన జరుగుతుంది.

## BUSINESS OF THE HOUSE

శ్రీ వి కోదండరామరెడ్డి అధ్యక్షా, నేను మీకు ఒక Adjournment Motion కు notice ఇచ్చాను అది యింతవరకు యిక్కడ సభ ఎదుటకు రాలేదు గనుక అడుగుతున్నాను అది ఏమైందండి ?

మిస్టర్ స్పీకర్ . అది తరువాత వస్తుంది. ముందు ఆఫీసుకు పోవాలి. అక్కడ పరిశీలించబడుతుంది తరువాత అది నా దగ్గరకు వస్తుంది అది వచ్చి నప్పుడు ఏ తేది అనేది చెప్పగలము కానియిప్పుడు మీరు Adjournment motion కు notice యివ్వగానే, అది నావద్దకు వెంటనే రాదు.

శ్రీ ఎ. పి. సుబ్బారెడ్డి (నెల్లూరు) : అధ్యక్షా, నిన్న మన గౌరవసభ్యులు శ్రీ పి గోపాలరెడ్డి, చంగల్రాయనాయుడుగార్లు ఒకేసారి మద్రాసుకు పోతు న్నామని అన్నారు. అయితే వాళ్ళు ఇప్పుడు మరల వచ్చారు. ఎందుకో చెబుతారా ? ఏమి సమాచారము ?

మిస్టర్ స్పీకర్ సంతోషముతో welcome చేస్తున్నాను గాని వారు ఎప్పుడూ కూడ యిక్కడే వుంటానంటే, మరీ సంతోషము

శ్రీ ఎన్ పి. చంగల్రాయనాయుడు (వేపంజేరి) అధ్యక్షా, మేము మద్రాసుకు పోతామని చెప్పలేదండి పోగూడదు ఇక్కడనే ఉండాలని అన్నాము

మిస్టర్ స్పీకర్ శ్రీ గంజి నాగేశ్వరరావుగారు హరిజనుల యిళ్ల స్థలములను గురించి చర్చించటానికి ఒక గంట టైము యివ్వవలసిందిగ నన్ను కోరారు వారు యిచ్చిన motion యీ క్రింద ఉదహరించబడింది

"ఆంధ్రప్రదేశ్‌లో అన్ని జిల్లాలలోను ఇండ్ల స్థలాల గురించి పేద ప్రజలు చాలా కాలంగా ఆందోళనచేస్తున్నారు యీరోజు 5, 6 ప్రశ్నలు ఇండ్ల స్థలాల కొరకే వేయబడ్డాయి అందుచేత శ్రీ గౌ అధ్యక్షులవారు యీ శాసనసభ సమావేశ కాలములోనే ఏదోఒక రోజున యీ సమస్యపై చర్చించడానికి ఒక గంట కాలాన్ని కేటాయిస్తారని కోరుచున్నాను"

ఈ హరిజనులకు యిళ్ల స్థలముల సమస్యను గురించి సాధారణముగ ప్రతిదినము చర్చల సందర్భములలో వస్తూనేఉన్నది గనుక దీనికి ఒక గంట యిచ్చినా, ఒకరోజు అంతా యిచ్చినా ప్రయోజనములేదు కాబట్టి నేను దీనిని consider చేయదలచుకోలేదు. కాబట్టి వారి కోరికను నిరాకరించటానికి విచార పడుతూ, త్రోసివేస్తున్నాను

తరువాత శ్రీ బి శ్రీరామమూర్తిగారు ఒక adjournment motion కు notice యిచ్చారు

"That the house be adjourned to discuss an urgent matter of public importance namely, the situation arising out of the failure of the Government to furnish adequate supply of fertilizers to the Central Co-operative Marketing Societies at Vijianagram and Srikakulam for the benefit of the Kisans in the two districts of Visakhapatnam and Srikakulam, which effects the food production"

ఈ విషయము food situation గురించి, fertilisers గురించి ఉన్నది. Food situation గురించి discussion అయిపోయింది గనుక దీనిని కూడ త్రోసి వేస్తున్నాను.

## THE ANDHRA PRADESH LAND REVENUE (SURCHARGE) BILL 1957

*The Minister for Revenue* (*Sri K Venkata Rao*) Mr Speaker, Sir, I beg to introduce the Andhra Land Revenue (Surcharge) Bill, 1957 and move that the Bill be taken into consideration at once

*Mr Speaker* Motion moved

*శ్రీ కె వెంకటరావు నేను మొన్నటి రోజున ఒక బిల్లును ప్రవేశ పెట్టుతూ కొన్ని వివరాలు సభ్యులకు చెప్పాను ఏమిటంటే రాష్ట్రీ ఆదాయానికి అవసరమైన రీతిన దేశములో కొన్ని పన్నులు విధించి వసూలు చేయ వలసిన ఆవశ్యకత ఉన్నది, అని అందులో యిది రెండవబిల్లు మనకు 1947 వ సం॥ లో స్వాతంత్ర్యము వచ్చిన తరువాత మన దేశమునకు ఏఒక్క నిర్ణయము లేకుండ అవసరాన్నిబట్టి అప్పటికప్పుడు అనుసరించి వేయబడిన ఒక పన్నుల సిద్ధాంతం మాత్రము మన దేశములో మనకు వారసత్వము వచ్చింది. అలాంటి పద్ధతిని యిప్పుడు మార్చి మనదేశములో అభివృద్ధి కార్యక్రమములకు అను గుణ్యమయ్యేటట్లుగా వీటిని అదుపులోనికి తీసుకుని రావలసిన ఆవశ్యకత ఏర్ప డిందని నేను మనవి చేశాను సాధారణముగ పన్నులు వేసేటప్పుడు అవి ఎవరి మీదనైతే పడుతారో వారికి వీటిమీద అభిమానము ఉండదుకాని అందోళన మాత్రము ఉంటుంది అంతమాత్రముచేత దేశములో ఉండే పేద ప్రజానీకము అంతాకూడ వాటివల్ల బాధపడుతున్నారని అనుకోవడము పొరబాటు **Taxation unpopularity** ఎవరిమీద అయితే పడుతుందో వారిమీదనే కాని యీ **unpopularity** బాహుళ్యముచేసి అంతా తలక్రిందులు అయిపోతున్నదని అనుకోవడము, చెప్పడము చాలా పొరబాటు అంతేకాకుండ యింకొకటి గూడ కొత్తపద్ధతిలో జరుగుతున్నది. **Social service expenditure** ఎక్కువగ చేసుకోవడమువల్ల, అంటే పన్ను యిచ్చుకోనటువంటి వారికి, యితరులకు ఈ వేసిన పన్నులయొక్క లాభము కలుగజేసే విధానముకూడ అమలులోనికి రావడమువల్ల మనయొక్క **economic development** యీ **unpopularity** అనేదికూడ చాలామటుకు తగ్గిపోతున్నదనే మనము అంగీకరించక తప్పదు ఈ పద్ధతిలో మనము యీ పన్నులు వేసుకోవడము జరుగుతున్నది, కాని ఇప్పుడు ఉన్న సందర్భము ఏమిటంటే, యీ విషయములో మనయొక్క పన్నుల విధానాన్ని చర్చించడం లేదుగాని, సాధారణముగా యీ పన్నులు వేయడంలో ఆదర్శము ఏమిటంటే, **progressive system of taxation** తెచ్చి అమలులో పెట్టుదామనే ప్రభుత్వము ఆలోచన. **Progressive system of taxation** అంటే, తక్కువ ఆదాయము వచ్చేవారిమీద తక్కువ వాటాలో పన్ను. ఎక్కువ ఆదాయము వచ్చేవారిమీద **proportionate** గా ఎక్కువగ

వేసుకుని వసూలుచేయడమే ఇప్పుడు Andhra Tenancy Surcharge Act 5-2-1957 తో పూర్తి అయిపోయింది Hyderabad Agricultural Incom-tax Act 1950 వ సం॥లో ప్యాసు అయింది ఇప్పుడు అది అమలులో ఉన్నది ఈ రెండింటిలోను గూడ యిప్పుడు నేను చెప్పిన progressive system అమలులోనే ఉన్నది కాని ఇప్పుడు ప్రవేశపెట్టబడిన Surcharge Bill లో Agricultural Income Tax లో కంటె progression చాలా steep గా ఉన్నది దీనికి ప్రధానమైన కారణము ఏమిటంటే, ఇందులో slab system లేదు ఒకటి మొదలు నూరువరకు రెండు అణాలు పుచ్చుకుని నూటఒకటినుంచి రెండు వందల యాభై వరకు నాలుగుఅణాలు పుచ్చుకోవడము జరగదు మొత్తము 250 రూపాయలు ఉంటే అంతకీకూడ నాలుగు అణాలు యిచ్చుకోవాలి అదే యీ surcharge లో ఉన్నపద్ధతి అందువల్ల అనుకున్న ప్రకారం progressive element ను మనము ప్రవేశపెట్టి ఒక పరిమితమైన జనాభానుంచి యీ పన్ను తీసుకోవడము ఆవశ్యకము అయితే, యిలాంటి బీదదేశములు Agricultural Income-tax లో ఉన్న progression కంటే surcharge లో ఉన్న progression ఆదాయము దృష్ట్యా, యింకాయితరదృష్ట్యాకూడ చాలా ఉపకరిస్తుంది ఇప్పుడు మనకు maximum 500 రూపాయిలపైన పన్నుచెల్లించేవారు ఎనిమిదిఅణాలు యివ్వవలసిఉంటుంది దీనినిబట్టి ఉదాహరణలుచూచుకోండి ఇప్పుడు రూ 499 లు మీద పన్ను చెల్లిస్తూ ఉంటే, దానిమీద surcharge రు 125 లు రు 501 ల మీద పన్ను చెల్లిస్తూఉంటే దానికి surcharge రు. 250లు అందువల్ల progression చాలా steep గా ఉన్నది కనుక యీలాంటి Progressive Taxation system యీ దేశములోనికి రావాలని ఎవరైతే కోరుతున్నారో, అలాంటి అభిప్రాయము, ఉదార స్వభావము కలిగినవారు, progressive views కలిగినవారని అనుకునేవారు అందరు కూడ యీ system ను బలపరచటములో న్యాయము ఉన్నది. అదేవిధముగ వారు బలపరుస్తారని నేను ఆశిస్తున్నాను.

ఇదివరకు ఆంధ్రలో ప్రవేశపెట్టిన బిల్లుకు దీనికి కొన్ని తేడాలు ఉన్నవి. ఈ బిల్లులో మొత్తము water rates మీద surcharge మటుకు పూర్తిగా పడడములేదు దీనికి రెండు కారణము లున్నవి. తెలంగాణంలో యీ రేట్లు ఎక్కువగ ఉండడము వల్ల వారి మీద ప్రభుత్వము వేయదలచుకోలేదు ఆంధ్ర దేశములో water rates ను పెంచుతున్నాము Wet assesment కూడ పెంచుతాము గనుక surcharge కి సంబంధించినంతవరకు యీ water rates లో ఉన్నటువంటి Land Revenue భాగము అంటే నూటికి 25 రూపాయల చొప్పున Land Revenue భాగము అని లెక్కఉన్నది, దానిమీదనే యీ sur-

charge వేయడము జరుగుతుంది పాతబిల్లుకు యిప్పటి బిల్లుకు ఉన్న తేడా యింకొక విషయము ఉన్నది ఏమిటంటే ఇదివరకు ఒక రూపాయి. అంతకు తక్కువ పన్ను చెల్లించేవారికి surcharge లేదు కాని ఇప్పుడు పదిరూపాయిలు పన్ను చెల్లించేవారికి యీ surcharge ఉండదు దీని యొక్క పర్యవసానము ఏమి అవుతుందంటే. సాధారణముగా సగటున చూస్తే యివి సరియైన లెక్కలుగా ఉండవు ఎందుకంటే ప్రతి individual case లో కూడ తరములను బట్టి మారుతూఉంటుంది గనుక dry acres పది మొదలు 80 ఎకరాల దాకా exemption రావటానికి chance ఉన్నది ఎందుకంటే ఒక్కొక్క ఎకరానికి రెండు అణాలు పన్ను ఉన్నటువంటి ఎకరాలు కూడ కొన్ని ఉన్నవి కాని సగటున dry areas లో పదిఎకరాలకు తక్కువరాదు Wet areas లో యిప్పుడు యితర పన్నులుకూడ వేయడమువల్ల 25% మీదనే వేస్తున్నాము కనుక అదికూడ సగటున ఆరు ఎకరాలు మొదలు ఏడు ఎకరాలదాకా exemption క్రిందకు వస్తాయి

Surcharge యిదివరకు వున్నదే 11 రూపాయల దగ్గరనుంచి 18నయా పైసలు. 500 రూపాయలపైన 50 నయాపైసలు అందువల్ల దానిలో కూడా ప్రత్యేకమైన మార్పులేదు ఒక రెవిన్యూ ఫిర్కాలోవున్నటువంటి మొత్తం ఆస్తిని తీసుకుని పన్నువేయడానికి అస్కారం కలుగజేశాము ఇది వరకు కూడా అలాగే వుంది కాని యిది మార్చవలసిన న్యాయంవుందని నాకు తెలుసును కాని యీ సంవత్సరం సాధ్యపడదు మనం వేసిన census ordinance అంకెలు కూడుకునేటప్పటికి జనవరి, ఫిబ్రవరి నెల పడుతుంది జనవరి నుంచి యీ పన్ను వసూలుచేయాలి కనుక పాతపద్ధతినే యీ వ్యవహారం చేయవలసిన అవశ్యకత ఏర్పడింది ముందు సంవత్సరం declaration of property అయిన తరువాత కొత్త అంకెలన్నీ కూడినతరువాత దానిని మార్చుకోవడం అవసరంవుంటే మార్చుకోవచ్చు దానికేమీ కష్టంలేదు అదికాకుండా ఇక్కడ తెలంగాణా భాగంలో ఫిర్కా, గిర్దావార్ circles స్ఫుటంగా లేవు. తరువాత records క్రొత్తగా ఈమాటే ప్రవేశపెట్టాం కనుక తయారు చేసుకోవలసిన అవశ్యకత కలిగింది. దీనినిబట్టి యీ రెవిన్యూ ఫిర్కాకుమించి యీ మొత్తంకూడిక తీసుకోడం కష్టంఅవుతుంది కనుక అలాగే అది అట్టేపెట్టడం జరిగింది. ఇదివరకటిలోలాగే penal assessment మీదగాని వాపసు యిచ్చినటువంటి remitted taxes మీదగాని అసలు వ్యవసాయమే చేయని భూములమీదగాని surcharge విధించబడదు అప్పటికీ యిప్పటికీ వున్నతేడా యిప్పుడు తమకు మనవి చేశాను. ఇంక ఒక్క విషయమే చెప్పవలసివుంది ఇదివరకు

కట్టుబటి, జోడీ యిచ్చేటటువంటి యినాములమీద కట్టుబడి, జోడీమీదే surcharge వేసేవాళ్ళము దరిమిలా ప్యాసయిన శాసనం ప్రకారం కట్టుబడి జోడీవున్న యినాములన్నీ రైత్వారీ భూములు అయిపోయినాయి కనుక వారికిప్పుడు full assessment రేట్లు వచ్చాయి కనుక క్రొత్తపద్ధతిని full assessment మీదనే surcharge వేయవలసిన అవసరంవుంది ఈ సందర్భంలో ఒక్క విషయం నేను స్పష్టం చేయదలచుకొన్నాను అదేమంటే Local Board cess మీద గాని, educational cess మీద గాని యీ surcharge పడదు ఈ సందర్భములన్నీ ఆలోచించి మన అవసరాలను గుర్తించి పన్నులు వేయడం విషయంలో న్యాయాన్ని ఆలోచించే ఈ బిల్లు తీసుకురాబడింది కనుక త్వరలో యీ బిల్లును ఆమోదించవలసినదని కోరుతూ ప్రస్తుతం యీ బిల్లును Select Committee వారికి పంపించవలసినదనే ప్రతిపాదన తమముందర నేను మనవిచేస్తున్నాను

*Mr. Speaker* Sri Visweswara Rao will now move his amendment to this motion

*Sri V. Visweswara Rao (Mylavaram)* Sir, I beg to move

"That the Bill be circulated for the purpose of eliciting public opinion"

*Mr. Speaker* Amendment moved

శ్రీ వి. విశ్వేశ్వరరావు. అధ్యక్షా, మంత్రిగారు యీ బిల్లును ప్రవేశ పెడుతూ యిది చాలా progressive పద్ధతిలో వుందనీ, అందుచేత దీనిని progressive వాదులు బలపరుస్తారనే ఆశతో ప్రవేశపెడుతున్నానని ప్రారంభించారు నేనుకూడా యీ బిల్లును పరిశీలించాను ఒకసారి కాదు, రెండుసార్లు పరిశీలించాను దీంట్లో చాలా progress వుంది, gradation పెట్టారు దీనిని బలపరచకపోతే ఎలా? 1930సంవత్సరంలో కాంగ్రెసు "ఈ నాడున్న పన్నుల విధానం పూర్తిగా మార్చి graded and proportionate taxation తీసుకు రావాలి"అని చెప్పింది; కనీసం 27 సంవత్సరాలైన తరువాతనైనా తీసుకు వచ్చినప్పుడు బలపరచకపోతే ఎలాగని పరిశీలించాను కాని దీనిలో మంత్రిగారు చెప్పింది ఎక్కడాలేదు. మంత్రిగారు తమ ఉపన్యాసంలో తరువాత చెబుతూ కొన్ని మినహాయింపు లున్నాయన్నారు. వారు యిచ్చిన మినహాయింపులు ఏమిటి? 6 ఎకరాల మెట్టభూమికి మాత్రం మినహాయింపు వుంటుంది, అయితే ఏ

వున్నటువంటి వారందరూ పన్ను చెల్లించవలసినదేనని చెప్పారు. ఇంతక్రితం ముఖ్యమంత్రిగారు శాసనసభలో మాట్లాడుతూ, "కనీసం నెలకు వందరూపాయలైనాసరే జీతం వుండాలి అదే మా ప్రభుత్వంయొక్క ఆశయము" అని చెప్పారు నిజమే అట్లా వందరూపాయలు కనీసజీతం ఉద్యోగస్థుల విషయంలో చెప్పినప్పుడు రైతాంగానికికూడా వందరూపాయలు గీటురాయిగాతీసుకోవచ్చు వందరూపాయలు ఆదాయము వచ్చేటటువంటివారికి దీనిలో మినహాయింపు యేమయినా వున్నదా అని రెవిన్యూమంత్రిగారిని మీద్వారా అడుగుతున్నాను "6 ఎకరాల మెట్టకు మాత్రం మినహా యిస్తున్నా"నని వారే చెప్పారు ఒక ఎకరం మాగాణీ మినహా యిస్తున్నాం అని చెప్పారు ఇది ఎంతవరకు మినహా యిస్తున్నారు Graded progress ఎక్కడవుంది? ఆ 6 ఎకరములలో ఎంత ఆదాయమువస్తుంది? నిన్న వ్యవసాయశాఖ మంత్రిగారు ఆరుఎకరాలుగలరైతుల కెంత ఆదాయం వస్తుందో చెప్పారు కాంగ్రెసు ప్రభుత్వం గత 2½ సంవత్సరాలలోను సుమారు ఆరుకోట్ల రూపాయలు పన్ను పెంచింది ఇంకా పన్నులు పెంచాలని చెబుతున్నది పన్నులు వేయవద్దని చెప్పను పన్నులు వేయవలసినదే కాని ఎవరిమీద వేయాలనేదే గీటురాయిగా పెట్టుకోవాలని మీ ద్వారా ప్రభుత్వానికి మనవి చేస్తున్నాను పన్నులు వేసేటప్పుడు ఎవరైతే భరించగలరో, ఎవరికైతే యిబ్బంది లేకుండా చెల్లించే అవకాశంవుందో వారిమీదే వేయవలసినదని మీ ద్వారా ప్రభుత్వానికి మనవి చేస్తున్నాను ఆరు ఎకరాల మెట్టభూమిమీద రైతుకువచ్చే ఆదాయం ఎంత? తెలంగాణా ప్రాంతంలో చూసుకుంటే ఒక ఎకరం మెట్టభూమికి 10 రూపాయలు శిస్తు చెల్లిస్తున్నాడు అని ప్రభుత్వమిచ్చిన రిపోర్టులోనే వుంది ఆరు ఎకరాలకు 60 రూపాయలవుతుంది. దానిపైన పన్ను చెల్లించవలసినదే ఆవిధంగా 6 ఎకరాల మెట్టకుకూడా మినహాయింపు లేకుండా పోతుంటే రైతు ఏ విధంగా చెల్లించగలడు? అతనికున్న ఆస్తి ఎంత? ముఖ్య మంత్రిగారు చెప్పిన నెలకు కనీసం వంద రూపాయలనే సిద్ధాంతం దీనికి పాటించవలసిన అవసరంలేదా అని మీ ద్వారా మంత్రిగారిని అడుగుతున్నాను. వీరిని ఈ పన్నులనుండి మినహాయించడానికి ప్రభుత్వం పూనుకుంటుందా? పూనుకుంటే తప్పకుండా support చేయడానికి సిద్ధంగా వున్నాము వారు proportunate గా చేస్తామని చెప్పారు. ఆంధ్ర రాష్ట్రంలో గత సంవత్సరం surcharge వేశాము 60 లక్షల రూపాయలు వసూలయినది. 10 లక్షల రూపాయలు యింకా వసూలు కావాలని సెలవిచ్చారు 60 లక్షల రూపాయలేకాదు. కోటి రూపాయలు వచ్చే సదుపాయాలు కలుగజేస్తూ సవరణలు పెట్టి అంగీకరించాలని కోరాము. 600 రూపాయలు పన్ను కట్టేవారు అర్ధరూపాయే చెల్లించవలసిన అవసరం యేమిటి? 500 రూపాయలు land

revenue కట్టేవారికి ఎన్ని ఎకరాల భూమి వుండాలి వారికి రూపాయికి రూపాయి చొప్పున వసూలు చేయడానికి ఎందుకు పూనుకోకూడదు ? ఆ విధంగాచేస్తే యీనాటి లెక్కల ప్రకారం ఒక కోటి లేక రెండు కోట్ల రూపాయల ఆదాయము రావడానికి అవకాశం వున్నది అటువంటి వనరు లున్నప్పుడు చిన్న రైతులనే పన్ను చెల్లించుకోవాలనీ, కష్టపడి పనిచేసే రైతులే అదనంగా పన్నులు చెల్లించుకోవాలని మంత్రిగారు సెలవివ్వడం సరైనదికాదు మినహాయింపు 10 రూపాయలు పెట్టడం సరైనదికాదు దానిని 50 రూపాయలకు పెంచాల్సిన అవసరంవుంది 50 రూపాయలు చెల్లించేవారు మినహాయించ బడినప్పుడే సంవత్సరానికి 1200 రూపాయలు, నెలకు వంద రూపాయలు ఆదాయము గలవారిని మినహాయించడానికి అవకాశం వుంటుంది ఆ విధంగా చేసినప్పుడే శ్రీ వెంకటరావుగారు చెప్పిన proportionate taxes అనే సూత్రముకు అర్థముంటుందని మనవిచేస్తున్నాను దానిని చేయకుండా యీ బిల్లును అంగీకరించమంటే సరైనదికాదని మనవిచేస్తున్నాను ఇంకా వారు చెబుతూ దేశంలో వనరులు అభివృద్ధి చేసుకొని అభివృద్ధి కార్యక్రమాలు కావాలంటే పన్నులు పెంచవలసినదేనన్నారు. నిజమే దేశంలో వనరులు అభివృద్ధి చేయాలంటే పన్నులు పెంచవలసినదే కాని యీ అభివృద్ధి కార్యక్రమాల విషయం చూస్తే ఆశ్చర్యంగా కనబడుతున్నది. మొదటి పంచవర్ష ప్రణాళికలో మొత్తం భారత దేశంలో తలకు రు. 60-0-4 లు ఖర్చుపెడితే ఆంధ్రదేశంలో తలకు 26 రూపాయలు ఖర్చుపెట్టారు! రెండవ పంచవర్ష ప్రణాళిక Budget estimates తయారైనవి మొత్తం భారతదేశంలో తలకు 124 రూపాయలు చొప్పున ఖర్చుపెట్టదలచుకుంటే ఆంధ్రప్రదేశ్‌లో తలకు రు 52 లు మాత్రమే ఖర్చుపెట్ట దలచుకున్నారు. ఎందు కింత వ్యత్యాసం ఉండవలసిన అవసరం వచ్చింది ? ఆంధ్ర ప్రజలలో అభివృద్ధి కార్యక్రమం నిర్విఘ్నంగా సాగాలంటే మొత్తం యింత వ్యత్యాసం ఎందుకుండవలసిన అవసరం వచ్చిందో నాకు అర్థంకాకుండా వుంది.

శ్రీ కె వెంకటరావు : పన్నులు వేసుకోకపోవడం వల్ల

శ్రీ వి. విశ్వేశ్వరరావు : పన్నులు వేసుకోకపోవడం వల్లనే మనం ఖర్చు పెట్టుకోలేకపోతున్నామని మంత్రిగారు చెప్పారు ఒక సంవత్సరంలో ఆరుకోట్ల రూపాయలు పన్నులు వేసుకున్నాం ఒక సంవత్సరంలో 6 కోట్ల రూపాయలు పన్నులు వేసుకున్న రాష్ట్రం ఇంకాపదివున్నదో మంత్రిగారు చెబితే అర్థంచేసుకోగలను. అయిదు సంవత్సరాలలో 5×6=30 కోట్ల రూపాయలు వసూలు

చేస్తున్నామని మనవిచేస్తున్నాను ఇంత కంటె ఎక్కువ taxation వేసుకునే రాష్ట్రం లేదని మనవిచేస్తున్నాను అందువల్ల యీ ఒనరుల కార్యక్రమం చూసినప్పుడు ఆంధ్రప్రదేశ్ కు చాలా తక్కువ జరుగుతున్నదని చెప్పాల్సివుంది ఆంధ్రదేశంలో నిరుద్యోగం ఆనాటి కానాకు పెరిగిపోతున్నది శాసనసభ సమావేశమైనప్పుడు పన్నులు వేయాలని ఎంతసేపూ చిన్న రైతుల మీదే పన్నులు వేయడానికి పూనుకోవడం జరుగుతున్నది

ఆంధ్రదేశములో పరిశ్రమలను అభివృద్ధిచేయటానికి ప్రభుత్వం పూనుకోవటంలేదు మొదటిపంచవర్ష ప్రణాళికలో ఆంధ్రదేశములో పెట్టిన పరిశ్రమ ఒక్కటైనా ఉన్నదా అని ప్రభుత్వాన్ని ప్రశ్నిస్తున్నాను ఈనాడు మనము రెండో పంచవర్ష ప్రణాళికను అమలుజరువుతున్నాము అప్పుడే రెండవ పంచవర్ష ప్రణాళికలో ఒక సంవత్సరం గడచింది ఈ సంవత్సరములో ఆంధ్రప్రదేశ్ లో చేసిన పెద్ద పరిశ్రమ ఏదని నేను మంత్రిగారిని అడుగుతున్నాను పరిశ్రమను ఏర్పాటుచేయటానికి తగిన వనరులు కాని, సౌకర్యాలు కాని లేదా అవసరమైన ముడిసరుకులు కాని ఆంధ్రదేశములో లభ్యం కాకనే పెట్టలేక పోతున్నామా ? అని అడుగుతున్నాను. మూడు పరిశ్రమలను పెట్టటానికి ప్రయత్నిస్తున్నామని మంత్రిగారు గత శాసనసభా సమావేశంలో చెప్పారు. మూడు పరిశ్రమలలో ఒక్క పరిశ్రమ అయినా పెట్టటానికి ప్రయత్నంచేశారా ? ఒక పరిశ్రమకు అయినా పునాదిరాయి వేశారా ? అని అడుగుతున్నాను. "మేము పరిశ్రమకు పునాదిరాయి వేస్తే ఏ విశ్వేశ్వరరావో సమ్మెచేస్తాడు" అని మంత్రిగారు చెబుతూ వుంటారు మేము సమ్మెలుచేస్తున్నా కనీసం కార్మికుల కోర్కెలు తీర్చండని వారికి అన్యాయం చేయవద్దని అనేకసార్లు ప్రభుత్వానికి చెప్పాము వారు ఏ పరిశ్రమకు పునాదిరాయి వేసినదిలేదు వాటిని అభివృద్ధి చేయటానికి పూనుకొన్నదిలేదు. పన్నులు వేసేటప్పుడు మాత్రం 'మనదేశం సోషలిస్టు సమాజానికి వెళ్ళాలంటే, ఆంధ్రదేశంలోని పరిశ్రమలను అభివృద్ధి చేయాలంటే, ఆంధ్రదేశములో సంక్షేమ కార్యక్రమములను అభివృద్ధి చేయాలంటే పన్నులు వేయాలి' అని చెబుతారు. దేశంలో వున్న నిరుద్యోగ సమస్యను రెండవ పంచవర్ష ప్రణాళికలో ఎంతో తగ్గించటానికి అవకాశం వుందని, ఎంతో మందికి పనులు చూపిస్తామని చెప్పారు కాని ఈనాడు ఆంధ్రదేశములో చూస్తే అదంతా హుళక్కి అని తెలుస్తోంది. కనీసం ఇదివరకువున్న పరిశ్రమలను అయినా పునరుద్ధరించటానికి చేసిన ప్రయత్నం ఏదైనా వున్నదా అంటే అది ఎక్కడా కనిపించటంలేదు 'తుంగభద్రా కాలువను త్రవ్వాము, K. C. కెనాలుకు 4 కోట్లు ఖర్చుపెట్టి అభివృద్ధి కార్యక్రమము సాగిస్తున్నాము' అని

చెప్పారు కాని ఈ డబ్బు సక్రమంగా వినియోగం అవుతున్నదో లేదో ప్రభుత్వము పరిశీలించటము లేదు

ఎస్టిమేట్సు రిపోర్ట్సు వున్నాయి ఎంత నీటిని ప్రవహింపచేయాలో, ఎంత నీటిని ప్రవహింప చేస్తున్నారో మంత్రివర్గం ఎప్పుడైనా పరిశీలించిందా అని అడుగుతున్నాను మన ప్రణాళికలు డబ్బు రూపములో ఖర్చు కన్పిస్తున్నది కాని దానివల్ల ప్రజలకు ఏమిలాభం కల్గుతోందని చూడడం జరగటంలేదు ప్రణాళికలో చూపించిన డబ్బు అంతా ఖర్చు అవుతోంది కాని దానివలన ప్రజలకు సౌకర్యములు కలగటంలేదు "సంక్షేమ కార్యక్రమములను ఎక్కువగా సాగించాము కనుక వెనుకబడిన ప్రజలు, బీదప్రజలు మమ్మల్ని బలపరుస్తున్నారు" అని మంత్రిగారు చెప్పారు అది నాకు చాలా ఆశ్చర్యాన్ని కల్గించింది ప్రతిరోజు ప్రశ్నల రూపంలో హరిజనుల ఇండ్ల సమస్య వస్తున్నదనే చెప్పారు ఈ సంవత్సరంలో ఎంతమందికి ఇండ్ల స్థలాలు ఇచ్చారు హరిజనుల ఇండ్లస్థలాల కొరకు కేటాయించిన డబ్బులో బీదప్రజలకు, వెనుకబడిన ప్రజలకు, షెడ్యూల్డ్ ట్రైబ్స్, షెడ్యూల్డ్ కాస్టుల ప్రజానీకానికి ఎంత డబ్బుఇచ్చారు? వారికి జీవనోపాధి కలుగ చేయటానికి ఎంత డబ్బు ఇచ్చారని పరిశీలిస్తే, చాలా తక్కువని చెప్పక తప్పదు. నిర్మాణ కార్యక్రమములకు కేటాయించిన డబ్బు సక్రమముగా ఖర్చు కాక officials చేతులలోనే అయిపోయిన సందర్భాలు అనేకం వున్నాయి సంక్షేమ కార్యక్రమం సక్రమంగా నిర్వహింపబడటంలేదు పేరుకు మాత్రమే కనబడుతున్నది పెద్ద పెద్ద మొత్తములు వాటికి కేటాయించినా అవి సక్రమముగా వినియోగింప బడటంలేదు

అభివృద్ధి కార్యక్రమములలో రోడ్ల అభివృద్ధి విషయం వుంది కొత్త రోడ్లు వేయటం గురించి నాకు తెలియదు కాని వున్నరోడ్లు ప్రయాణములకు సౌకర్యముగాలేవు. ఇదివరకు విమానములో ప్రయాణం చేస్తేనే ఇన్సూర్ చేయాలి, ఇప్పుడు రోడ్డుమీద ప్రయాణం చేయవలెనంటే ఇన్సూర్ చేసి ప్రయాణం చేయవలసిన పరిస్థితులు ఏర్పడుతున్నాయి. పాత రోడ్ల కంకర అంతాపోయి, పాడైపోతుంటే వాటిని అలాగేవుంచి కొత్త రోడ్లు వేస్తామని చెబితే, మన ప్రణాళికలో కేటాయించిన డబ్బు ఈ కొత్త రోడ్లకు, పాతరోడ్లకు సరిపోదేమోనని నాకు అనుమానంగావుంది. ఎంతో భూమిని సాగులోనికి తీసుకురావాలని ఈ ప్రణాళిక తయారుచేశాము చాలా చోట్ల ఎరువులు పంచటం వ్యవసాయ శాఖ నిర్వహిస్తున్నదని చెబుతున్నారు. ఈ మధ్య కృష్ణాజిల్లా ప్లానింగ్ కమిటీ మీటింగ్‌లో వ్యవసాయ శాఖచే నిర్వహించబడుతున్న ఒక వ్యవసాయ

ఫారమ్ గురించి చర్చకు వచ్చింది అది చాలా అధ్వాన్నంగావుంది అది వ్యవసాయ శాఖవారు నిర్వహించే ఫారమని చెప్పవద్దని జిల్లా ప్రణాళిక సంఘం చెప్పవలసివచ్చింది కలుపుతీసే కూలీలకు డబ్బు శాంక్షన్ చేయలేదు కాబట్టి మేము కలుపుకూడా సరిగా తీయలేదని వారు చెబుతున్నారు రైతులకు నేర్పే విధానాలు చాలా అధ్వాన్నంగా వున్నాయి పూడ్చేనాడు ఇవ్వవలసిన డబ్బు కోసేనాడు ఇచ్చేడబ్బు, కోసేనాడు, ఊడ్చేనాడు ఈ విధంగా శాంక్షన్ అవటంచూస్తే ఈ ఫారమ్స్ ఎంత అధ్వాన్న స్థితిలో వున్నాయో తెలుస్తుంది నీటివనరులు, మురుగు పారుదల సౌకర్యాలు తగ్గిపోవటంవల్ల గత 2, 3 సంవత్సరములలో 1 6% ఉత్పత్తి తగ్గిందని ప్రభుత్వం సర్క్యులేట్ చేసిన ఎకనమిక్ అండ్ స్టాటికల్ బులెటిన్‌లో ఇవ్వబడింది ఎక్కువ భూమి సాగులోనికి వస్తుంది కాని ఎకరానికి పండేపంట చూస్తే కొన్ని కొన్ని ప్రాంతాలలో తగ్గిపోతుందని ఈ బులెటిన్‌లో చెప్పారు

ఇక వ్యాపార విషయాన్ని చూస్తే ఆంధ్ర దేశములో ఎంత వ్యాపారము అభివృద్ధి చేశారనేది ప్రశ్న ఈ 5 సం॥ లలో వ్యాపారాభివృద్ధి ఏమి జరుగలేదని చెప్పాలి ప్రణాళికలోని కార్యక్రమం కోసం ఎక్కువ పన్నులు వేస్తున్నామని చెబుతూ పనులు చేయలేకపోవటం మంత్రి వర్గానికి భావ్యం కాదని మనవి చేస్తున్నాను ఈ బిల్లుగురించి చెబుతూ 10 రు. ల లోపు వున్న వారిని మినహాయించామని మంత్రిగారు చెప్పారు. గుంటూరు జిల్లాలో ఎకరం మెట్టకు 10 రు లు చెల్లిస్తున్నారు తెలంగాణా ప్రాంతములో నీటితీరువ ఎక్కువగా వున్నది 23, 24 వరకు చెల్లించవలసి వుంటున్నది. రెండు ఎకరాల మాగాణివున్న వారు ఈ శిస్తును చెల్లించవలసివుందని అర్థంఅవుతున్నది.

శ్రీ పి. శ్రీరాములు (దుగ్గిరాల) : గుంటూరుజిల్లాలో లాండ్ రెవిన్యూ, వాటర్ రేటు రెండుకలిపి 10 రు లు వుంది కాని ఒక లాండ్ రెవిన్యూ 10 రు. లు వున్న జిల్లా తక్కువ.

శ్రీ కె. వెంకటరావు : గౌరవ సభ్యులకు ఒక మనవి చేయవలసివుంది. తూర్పు గోదావరిజిల్లాలో తప్పితే dry rate 8 రు. వున్న ప్రాంతము ఆంధ్ర రాష్ట్రములో ఎక్కడా లేదు.

శ్రీ వి. విశ్వేశ్వరరావు : ప్రభుత్వమిచ్చిన బులెటిన్‌లో గుంటూరుజిల్లాలో 10 రు. అని వుంది. 6 ఎకరాలు మెట్టవున్న రైతుమంత్రివర్గం చెప్పినప్రకారం

చెల్లించవలసి వుంటుంది నెలకు 100 రు ఆదాయం వచ్చేవారిని మినహాయించాలని నేను కోరుతున్నాను దానికి తగిన భూవసతి వున్నవారిని మినహాయించమని నేను కోరుతున్నాను 50 రు లు శిస్తు చెల్లించేవారిని మినహాయిస్తున్నప్పుడు ఇదికూడా సాధ్యమవుతుందని మంత్రిగారికి నేను చెబుతున్నాను 500 రు పైనున్నవారు రు 100కి 1-0-0 చెల్లించాలని, యింకా వేయిరూపాయలు పైన వున్నవారు రు 100కి 2-0-0 కూడా చెల్లించవచ్చునని నేను చెబుతున్నాను 20 ఎకరాలకు పైన వున్నవారు ఇవ్వాలని చెప్పటము వ్యవసాయ సంస్కరణలకు ముందు అది పెట్టటముతో చాల భూమి చిన్న చిన్న కమతాలుగా మారిపోతున్నదని నేను ప్రభుత్వానికి చెబుతున్నాను

దీనివల్ల పెద్దశిస్తులు చెల్లించేవారు లేకుండాపోతారని చెప్పవచ్చు. దానివల్ల చిన్నచిన్న భూఖండాలు అయిపోతే—జాయింట్ ఫామిలీలో ఉన్నటువంటి భర్తఆస్తి. భార్యఆస్తి, చిన్నపిల్లలఆస్తి అందరిఆస్తి కలిపిఒకే unit గా చేసి దానిమీద శిస్తు వసూలుచేయాలని కోరుతున్నాను ఒక రెవిన్యూఫిర్కాయే కాదు మొత్తం తాలూకాలలో, జిల్లాలలో మొత్తం రాష్ట్రంలో ఉన్న ఆస్తినంతా కలిపి ఒకే unit గా చూడవలసిన అవసరం ఉన్నది కాని. అందుకు విరుద్ధంగా చూడవలసిన అవసరం లేదు మనం ఎక్కువపన్ను కావాలనుకొంటున్నాము కనుక ఆ విధంగా చేసినట్లయితే ఎక్కువపన్ను రాబట్టుకోడానికి అవకాశం ఉంటుందని, దానికి ప్రభుత్వంవారు ప్రయత్నం చేయాలని కోరుతున్నాను ఈ విధంగా ప్రయత్నం చేసినప్పుడు ఒక కోటిరూపాయలే కాదు 2 కోట్ల రు॥ లు కూడా అదనంగా రావడానికి అవకాశం ఉంటుందని మంత్రిగారి దృష్టికి తెస్తున్నాను ఈనాడు శాసనసభా సమావేశాలు జరుగుతున్నాయంటే ఏ కొత్తబిల్లులు వస్తున్నాయో ఏ కొత్తపన్నులు. వస్తున్నాయో అని ప్రజలంతా ఆందోళన చెందుతున్నారు. ఈ విధంగా ప్రజలు ఆందోళన చెందే పరిస్థితులలో దీనిని ఈ రూపంలో చర్చించడం సరైనదికాదు. ప్రజాభిప్రాయం సేకరించి, వారి అభిప్రాయాలు స్పష్టంగా తెల్పికొన్నతరువాతనే శాసనం చేయడం సరిగా ఉంటుంది కాబట్టి దీనిని వెంటనే సెలక్టుకమిటీకి పంపాలనేది సరికాదని, అట్లా చేయవద్దని కోరుతూ, నేను ముగిస్తున్నాను.

మిస్టర్ స్పీకర్ : ఇకనుంచీ అందరూ 10 నిమిషాలచొప్పున మాట్లాడాలి. శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్యగారు దీనిని second చేస్తారు.

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య (సత్తెనపల్లి) : అధ్యక్షా, ఈ బిల్లును ప్రజాభిప్రాయానికి పంపాలి అనేదానిని నేను బలపరుస్తున్నాను.

ఇప్పుడు మన land revenue పద్ధతిని కూడా పునరాలోచించడానికి వేరే ఒక కమిటీని వేయబోతున్నామని చెప్పారు అట్లా కమిటీని వేయబోతున్న సమయంలో యిది తీసుకురావడం అనవసరమని నా మొదటి అభిప్రాయం Taxation commission వారు ఆలోచించినప్పుడు agricultural income taxను అన్ని విధాలా అమలుచేసినట్లయితే చాలా బాగుంటుందని చెప్పారు ఇప్పుడు ఈ బిల్లు తెలంగాణాలో అమలుజరుగుతున్న agricultural incometax Act ను కూడా రద్దుచేస్తున్నది ప్రభుత్వంవారు యిచ్చిన అంకెలను బట్టి డబ్బు సరిగా రావడంలేదని తెలుస్తున్నది

గోపాలరెడ్డిగారు ఆర్థికమంత్రిగా వారి ఉపన్యాసంలో "క్రిందటి సంవత్సరం వ్యవసాయాదాయం వల్ల ఒక లక్షా యాభై వేలు మాత్రమే వసూలు అయినదని చెప్పడానికి విచారంగా వుంది" అని చెప్పారు. నైజాం సుగర్ ఫ్యాక్టరీవారు publish చేసిన పుస్తకంలో taxes, Railway freight, and dividend paid to Government in 1955—56 అని వ్రాశారు అందులో ఇంకొక విషయం కూడా వ్రాశారు "అగ్రికల్చరల్ ఇన్‌కంటాక్సు క్రింద 3,49,714 రూ॥లు మేము ప్రభుత్వానికి చెల్లించాము" అని కూడా వ్రాశారు కాని మన ప్రభుత్వంవారు మాత్రం వారి account లో 1,50,000 రూ॥లు మాత్రమే జమవచ్చినట్లు వ్రాశారు

ఆర్థిక మంత్రి (డాక్టర్ బి. గోపాలరెడ్డి) నేను చెప్పినది 1956-57 సంగతి మొత్తం వసూలయినది 1,13,000 రూ॥లు Sugar factory వారు ఎన్నిసంవత్సరాలకు యిచ్చారో అందులో clear గా ఉన్నట్లులేదు. అది బహుశా 1955-56 సంగతి కావచ్చు.

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య. అయితే, అది మళ్ళీ చదువుతాను, 'Taxation Railway freight dividend paid to Government in 1955-'56 అని ఉన్నది. క్రిందటి సంవత్సరం అని గోపాలరెడ్డిగారు అన్నారు. ఇప్పుడు మనకు యిచ్చినది 1957 సం॥లో. 1956 లోని assessment 1955-56 మీద వస్తుంది.

డాక్టర్ బి. గోపాలరెడ్డి. 1956-57 లో 1,13,000 రూపాయలు వసూలయినది.

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య ఆ చిన్న సవరణకు నేను అంగీకరిస్తాను క్రిందటి సంవత్సరం అంత యిస్తే ఈ సంవత్సరం యింత తక్కువరావడానికి కారణం ఏమిటి ? నష్టం వచ్చినదా లేక లెక్కలలో పొరపాటు వచ్చిందా యని ఆలోచిస్తే లాభమే వచ్చిందనీ, ఎక్కువపన్ను చెల్లించడం జరిగిందని తెలుస్తోంది దీనినిబట్టి ప్రభుత్వంవారు శిస్తులు వసూలు చేయడంలో ఏమీ శ్రద్ధవహించటం లేదు అనేది ప్రధానంగా తేలుతోంది అగ్రికల్చరల్ ఇన్‌కం టాక్సు వేసినట్లయితే పెద్ద రైతాంగంమీద పడుతుంది కనుక వారిని exempt చేయడానికి వీలుండదేమో అనే ప్రాతిపదిక వేసుకొని పొరపాటు లెక్కలమీద ఆధారపడి, ఆ లెక్కలు మాకు చూపి యింకా వేయడానికి ఆలోచన లేదని మమ్ములను Convince చేయడానికి ప్రయత్నిస్తున్నారు కాని అది facts కు వ్యతిరేకంగా ఉన్నది కనుక మేము convince కావడానికి సిద్ధంగా లేము ఈ బిల్లులో ప్రధానమైనది surcharge ఒకటేకాదు అగ్రికల్చరల్ ఇన్‌కం టాక్సు రద్దు చేస్తామనేది ప్రధానమైనది అది చాలా అన్యాయం Land revenue system అంతా మారి అగ్రికల్చరల్ ఇన్‌కం టాక్సు తీసేయవలసినస్థితి వస్తుందేమో అని పిస్తున్నది వారు త్వరగా progressive countries గా పాతపద్ధతిని తీసేసి, కొత్తపద్ధతితో agricultural produce మీద వస్తున్న దానిపై పన్ను వసూలు చేద్దామని ఆలోచిస్తున్నారు Travancore Cochin State లో వారు agricultural income tax వేసి, Agricultural Wealth tax కూడా వేయడానికి నిర్ణయించారు. దానివల్ల ఈ సంవత్సరం వారి deficit budget ను surplus budget గా చూపించగలిగారని మనకు కనబడుతున్నది ఇప్పుడు ప్రభుత్వం చెప్పినదాంట్లో land revenue systems ఎన్ని ఉన్నాయి ? రాఘవేంద్రరావు గారు యిలా వ్రాశారు

> "There are at present 166 money rates in the whole province and it will be extremely difficult to reduce the number to any reasonably small number"

అంటే ఈవేళ 166 rates ఉన్నాయి వీటిని తగ్గించడానికి వీలు లేదన్నారు. నేను second part ను ఒప్పుకోను, కాని fact మాత్రం తీసుకుంటాను. 166 విధానాల tax అనేది ఉన్నది అది మార్చడానికి వేరేకమిటీని వేస్తున్నారు ఆకమిటీ నిర్ణయం చేసేంతవరకూ ఆగడం మంచిది.

అదికాకుండా, దీనిని రు 10 ల వరకూ అదనపుశిస్తు లేకుండా చేస్తున్నామని శ్రీ కళావెంకట్రావుగారు చెప్పారు ఈ విషయంలో పూర్వపు ఆర్థికమంత్రిగారికన్నా, ఈనాటి రెవిన్యూమంత్రిగారిని అభినందించవలసిన అవసరం ఉంటుంది. రు 10 లు శిస్తు చెల్లించేవారికైనా exempt చేయడం

అవసరమనే సిద్ధాంతాన్ని కొంతవరకూ ఒప్పుకున్నారు ప్రకాశంగారి మంత్రి వర్గంలో రు 10 లు శిస్తు చెల్లించేవారందరినీ exempt చేస్తామని చెప్పారు చేస్తారేమో అనుకున్నాను వారు చేయకపోగా యింకా taxes వేశారు ఆ తరువాత వచ్చిన మంత్రివర్గంలో వున్నటువంటి ఆర్థికమంత్రిగారు దానిమీద రు 10 ల వరకూ exempt చేయడానికి వీలులేదు కాబట్టి ఒక రూపాయి చేస్తామని చెప్పారు కొంచెం మార్పు తీసుకువచ్చి progressive taxation అమలు జరుపుతున్నారేమో అనే అభిప్రాయంతో కళా వెంకటరావుగారిని అభినందించాలి

డాక్టర్ బి. గోపాలరెడ్డి ఈ విషయమై Select Committee లో పునరాలోచించవలసి ఉంటుంది ఇప్పుడె అనుకోడానికి వీలులేదు

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య అధ్యక్షా, ఆర్థికమంత్రిగారికీ, రెవిన్యూ మంత్రిగారికీ ఈ విషయంలో చాలా వైరుధ్యం ఉన్నట్లు మనకు అర్థం అవుతోంది

మిస్టర్ స్పీకర్ అదికాదు

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య అదిగో, వారు తలకాయ ఊపుతున్నారు

డాక్టర్ బి గోపాలరెడ్డి ఈ విషయంలో మా యిద్దరిదీ ఒకే అభిప్రాయం

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య అయితే, ఆర్థికమంత్రిగారికి తెలిసి, రెవిన్యూమంత్రిగారికి ఏమీ తెలియకుండానే ఈ బిల్లు అచ్చు అయినదని అనుకోవలసి వస్తోంది

మిస్టర్ స్పీకర్ మీ time అయిపోతున్నది

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య : ఈ ప్రధాన సూత్రాలమీద interruptions వచ్చినప్పుడు అధ్యక్షులవారు ఆ interruptions ను ఆపించాలి లేకపోతే అందుకు compensation గా time అయినా యిప్పించాలని కోరుతున్నాను

మిస్టర్ స్పీకర్ - మధ్యన కొద్దిగా interruptions అయినవి కనుక 2 నిమిషాలు ఎక్కువ చేస్తున్నాను.

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య - భూమిశిస్తు విధానం ఎట్లా ఉన్నదని ఆలోచిస్తే దాదాపుగా 80 ఎకరాలవరకు కూడా రు. 10 ల మీద exempt కావడానికి వీలున్నదని అన్నారు. రు. 10 లు exemption అనే ప్రాతిపదికను

ఒప్పుకున్నారనే అభిప్రాయంతో, ఈ బిల్లులో వున్న ప్రాతిపదికమీద నేను మాట్లాడతాను అయితే యిప్పుడు assessment ఎట్లాఉన్నదంటే గోదావరి జిల్లాలోని upland portions లో రు 5-1-0 మెట్టమీద ఉన్నది గుంటూరు జిల్లాలోని ఒంగోలు తాలూకాలో 4-12-0 ఉన్నది నెల్లూరు జిల్లాలోని, నెల్లూరు, గూడూరు, కందుకూరు, కావలి తాలూకాలలో 4-8-0 ఉన్నది గుంటూరు జిల్లాలోని ఒంగోలు తాలూకా కోస్టల్ గ్రామాలలో రు 4-0-0 ఉన్నది నెల్లూరు జిల్లాలో రాపూరు తాలూకా, కర్నూలు జిల్లాలోని కోయల కుంట్లతాలూకా, కడపజిల్లాలోని రాయచోటి తాలూకా తప్పమిగతాతాలూకా లలో రు 4-0-0 లు ఉన్నది Guntur upland మూడు తాలూకాలలో 3-12-0 ఉన్నది Guntur upland 2 తాలూకాలలో ఎకరానికి 3-10-0 చొప్పున ఉన్నది విశాఖపట్టణం జిల్లాలో మొత్తానికి 3-9-0 కనబడుతున్నది గోదావరి, కృష్ణా డెల్టాలలో 3-8-0 ఉన్నది కర్నూలు జిల్లాలోని మూడు తాలూకాలలో రు 3-0-0 ఉన్నది అనంతపురం తాలూకాలో black cotton soil కు 2-13-0 ఉన్నది అట్లాగే చిత్తూరు జిల్లాలో మదనపల్లి, వాయల్పాడు తాలూకాలలో రు 2-0-0 ఉన్నది

డాక్టరు బి గోపాలరెడ్డి అన్నీ చదవండి

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య అవసరమైతే అన్నీ చదువుతాను ఇంకా చదువవలసి వుంటుంది

80 ఎకరాలకు అన్వయం అవుతుందనేది correct కాదని నేను చెబుతున్నాను 2, 3 ఎకరాల వారికి మాత్రమే వస్తుంది ఎక్కువమందికి ఈ బిల్లును వర్తింపచేసేటట్లు చేయాలనే ఉద్దేశం ప్రభుత్వానికి ఉన్నది కనుక పెద్దమొత్తానికి exemption కు వెళ్ళవలసిన అవసరం ఉంటుంది. మనం లెక్కలు తీసుకొనేటప్పుడు ఒక్క ఫిర్కాకు మాత్రమే తీసికొంటున్నాము క్రిందటిసారికూడా ఒక ఫిర్కాకే తీసుకొన్నారు రాష్ట్రం మొత్తానికి తీసికోమని చెబితే "అసలు పన్ను ఎగగొట్టడానికే గోపాలకృష్ణయ్యగారు ఆలోచిస్తున్నారు" అన్నారు. అదికాకుండా వెంటనే వసూలుచేయడానికి ప్రాతిపదిక కావాలి కనుక ఫిర్కాల విషయమే చూసుకుంటే ఏ ఫిర్కాకు ఆ ఫిర్కాయే లెక్కసరిపోయేట్లు చేస్తున్నారు, అంటున్నానని గోపాలరెడ్డిగారు, చెప్పారు. ఇంతవరకూ వసూలు చేయడమే పూర్తి కాలేదని చెప్పారు. 48 లక్షలు వస్తుందనుకున్నారు అది 56 లక్షలు వచ్చినట్లు రెవిన్యూమంత్రిగారు లెక్కలు యిచ్చారు.

అందువల్ల మీరు వేసే అంచనాలకు, ఆదాయాలకు సంబంధం లేకుండా పోతున్నది కనుక వారు అంచనాలను ఎక్కువగా వేసుకుంటున్నారు చిన్న అంచనాలను వేసి మాచేత పెద్ద **Taxation Bill** ఒప్పించాలని వారి ప్రయత్నం. **Statistics correct** గా ఉండవు అంచనాలు **correct** గా ఉండకంలేదు ఈ **taxation** తో ప్రభుత్వం యొక్క విధానం ఏ విధంగాఉందో నాకు తెలియకుండా ఉంది ఈవేళ భూముల పంపకం జరుగుతోందని అంటున్నారు భూముల పంపకం జరిగినపుడు తక్కువ ఆదాయం వస్తుందనే టట్లయితే, మీకు అది చిక్కులేనటువంటి పద్ధతి, కొద్ది **income tax** ను వదిలిపెట్టేసి తక్కిన **land produce** మీద **agricultural wealth tax** వేసేటట్లయితే మనకు చిక్కులేకుండా పోతుంది ఆ విధంగా మనకు ఎక్కువ ఆదాయం రావడానికి వీలవుతుంది ఇకపోతే చేసే ఖర్చులనుగురించి ఆలోచించవలసి యున్నది ఖర్చులను చేసేటపుడు, అనేక అనవసరమైనటువంటి వృధా ఖర్చులను చేస్తున్నారు

అధికారుల పెంపకం ఎక్కువగా చేస్తున్నారు పెద్ద ఉద్యోగులకు జీతములను ఇంకా ఎక్కువ యిస్తున్నారు క్రింద పనిచేసేవాడికి జీతం తగినట్లు యివ్వడంలేదు అందువల్లనే వసూలుచేసే వాడెవడైతే ఉన్నాడో వాడు పన్ను ఎగగొట్టే విధానం, తప్పించుకొనిపోయే విధానం, డబ్బు రాకుండా ఉండే విధానం ఆలోచిస్తున్నాడు పైవాడిని మీరు అడిగితే దానికి తప్పుడు లెక్కలు చూపిస్తున్నాడు అందువల్ల ఈ మొత్తం ఉండే ప్రాతిపదిక తప్పేనని, ఈ విధంగా జరిగే విధానాన్ని మార్చాలని, **Agricultural Income-tax** ఒకటి, **Agricultural Wealth-tax** కొకటి, విధిగా వేయించాలని నేను చెప్తున్నాను (ఇంకా ఎన్ని నిముషాలుందో చెపితే దానినిబట్టి ముగించుకుంటానండి.)

మిస్టర్ స్పీకర్ ఇంకా రెండు నిముషాలు

శ్రీ వావిలాల గోపాల కృష్ణయ్య అందువల్ల ఇప్పుడు ప్రభుత్వం తీసుకురావలసిన విధానం ఇది కాదని, ఈ విధానం సరైనదికాదని అందరూ ఒప్పుకొంటున్నారు.

మనం కేంద్ర ప్రభుత్వం నుంచి ప్రతిదానికి డబ్బు సహాయం కోసం చూస్తున్నాము. **Land Revenue** ను రాష్ట్రప్రభుత్వమే తీసుకుంటుంది. **Income tax** ను కూడారాష్ట్రప్రభుత్వమే వసూలుచేస్తుండేటట్లయితే బాగుండేది. ఇప్పుడు వచ్చేడబ్బు మనకు చాలకుండా వుంటున్నది. 80 కోట్ల వరకు **income tax** లో జారిపోతుందని శ్రీ టి. టి. కృష్ణమాచారిగారు చెప్పారు. వారికన్నా కూడా **authoritative** గా **Central Revenue Board** వారు చెప్పగలరు

Central Revenue Board వారు 200 ల కోట్ల రూపాయలు జారిపోతున్నవని చెప్పారు అయితే Central Revenues గురించి మీ రెందుకు చెపుతున్నారని అంటారేమో ! 200 ల కోట్ల రూపాయలు income-tax కనుక వచ్చేటట్లయితే మనకు అందులో నుంచి మన వాటా వస్తే ఈవిధంగా మనం అదనపు పన్నులు వేసుకోనక్కరలేదు

పెద్దవాళ్ళ మీద, ధనవంతుల మీద కూడా వేయకుండా వుండలేదు వాళ్ళపైనకూడా ప్రభుత్వం పన్ను వేస్తున్నది కాని దానిని వసూలుచేసేటపుడు అది చేయిజారిపోతున్నది వాళ్ళు తప్పించుకుపోతున్నారు ఆముదంరాసు కొని స్నానంచేసినట్టు జారిపోతున్నారు అందుచేత వాళ్ళను పట్టుకోవాలనే టట్లయితే, అందుకు తగిన ప్రయత్నంచేయాలి అపుడు అది ఉపయోగపడుతుంది కనుక పెద్ద రైతాంగంపై పన్నులు వేయడానికి ప్రభుత్వం అనుసరిస్తున్న ఈ విధానం ఇంకా చాలదు వాళ్ళ మీద ఏ అర్ధరూపాయో పన్ను వేశామని అంటున్నారు అలా కాదు మొదటి నుంచీ తగ్గించి, చివరకు ఎక్కువ ఆదాయానికి 5 రూపాయలు పన్ను కూడా సర్చార్జి వేసినా మాకేమీ అభ్యంతరం లేదు 1000 రూపాయలు సెస్ చెల్లించేవారిమీద, సంపదగలవారిమీద ఈవేళ ఉన్నటువంటి ఒక రూపాయ పన్నును 5 రూపాయల వరకూ ఎక్కువచేసి వేయండి రాజగోపాలాచారి గారి Ministry వారు వేసినటువంటి tax కు దీనికి చాలా తేడా ఉందని మనవిచేస్తున్నాను ఈ విషయంలో ఈ ఉదాహరణ ఒకటి చెప్పి ఈ విధంగా ఈవేళ ముగిస్తున్నాను

**"On the first five is nil, next 50 rupees 2 annas on each rupee next Rs 100/- 4 annas on each rupee, next Rs 300/- 8 annas on each rupee next Rs. 500/- 12 annas on each rupee on the balance 16 annas on each rupee"** అని వుంది అందువల్ల ఐదువందల రూపాయలమీద చెల్లించేవాడి దగ్గర రూపాయికి రూపాయితో ప్రారంభించి, 1000 రూపాయలు చెల్లించేవాడి దగ్గర రూపాయికి 5 రూపాయల చొప్పున **surcharge** వేస్తామని చెప్పేటట్లుగా ఉంటే ఏమీ అభ్యంతరం లేకుండా అంగీకరించడానికి సిద్ధంగా ఉన్నాము **lower stata** ను **exempt** చేయవలసి ఉంటుంది దీనితో పాటు **agricultural income tax** కూడా వేయవలెనని, దానిని తీయవద్దని, రద్దుచేస్తే ప్రమాదముందని దీనిని ప్రజాభిప్రాయానికి పంపించాలని కోరుతున్నాను

**శ్రీ పి గున్నయ్య (పాతపట్నం జనరల్)** : అధ్యక్షా, ఈ సర్చార్జి బిల్లును నేను బలపరుస్తూ కొన్ని విషయాలను తమద్వారా ప్రభుత్వ దృష్టికి తీసుకు వస్తున్నాను. ఇప్పుడు మనకు ఆంధ్రరాష్ట్రం వచ్చిన తరువాత కర్నూలులో

గోపాలరెడ్డిగారి దయవలన ఈ రైతులమీద 1½ కోట్ల రూపాయలదాకా 5, 6 పన్నులు వేసి ఉన్నారు ఇపుడు కూడా రైతుల మీదనే ఈ సర్ ఛార్జిని విధిస్తున్నారు ఈ సర్ ఛార్జినుంచి 10 రూపాయలు వచ్చేవాళ్లను మినహాయించి వాళ్ళకు ఈ సర్ఛార్జి లేదని మన మంత్రిగారు సెలవిచ్చారు ఈ బిల్లును Select Committee కి పంపుతామని మంత్రిగారు సెలవిచ్చారు సరే దానిలో కొన్ని మార్పులు చేయాలని తమద్వారా ప్రభుత్వానికి మనవి చేయుచున్నాను ఈ సర్ ఛార్జి అనేటటువంటిది బాగుగాపండినటువంటి భూములమీద, ప్రభుత్వం నీరునిచ్చే కష్ణా డెల్టాలోనున్న భూములమీద, మా పాలకొండ తాలూకాలో కొన్ని అటువంటి భూములమీద వేయాలి కాని నిజంగా మా శ్రీకాకుళంజిల్లాలో పాతపట్టణం, సోంపేట, ఇచ్ఛాపురం శ్రీకాకుళం చీపురుపల్లి తాలూకాల్లో చాలా ప్రాంతాలు చాలా మెట్టప్రాంతాలు అచట నున్న రైతులు ఇప్పటికి ఉన్న శిస్తునే కట్టుకోలేక అనేక ఇబ్బందులకు గురౌతున్నారు అలాంటి తాలూకాలలో ఈ సర్చార్జి (surcharge) ని వేయకుండా చేసే ఏర్పాటును సెలెక్టు కమిటీలో ఆలోచించాలని ప్రభుత్వానికి మనవిచేస్తు న్నాను మా శ్రీకాకుళం జిల్లాలో వర్షాలులేక పంటలు నష్టమైపోయి, రైతులు చాలా ఇబ్బంది పడుతున్నారు. రైతులు మాత్రం ఎన్ని పన్నులు వేసినా వాటిని శ్రద్ధగా కట్టినా, ప్రభుత్వోద్యోగులు రైతులకు కావలసిన, చెరువుల మరమ్మతులు చేయటంలేదని తమద్వారా ప్రభుత్వానికి తెలియచేయక తప్పదు మా జిల్లాలో చాలా ఎస్టేట్ గ్రామాలున్నాయి. ఈ ఎస్టేట్ గ్రామాలన్నీ 10 ఏళ్ళక్రితంరైత్వారీ గ్రామాలైనా ఇంతవరకూ కూడా ఆ గ్రామాలలో ఒక చెరువుకుకూడా మరమ్మత్తుచేయలేదని చెప్తున్నాను ఈ సంవత్సరంకూడా చాలా చెరువులు పాడైపోయినాయి ఆ చెరువులను బాగుచేయించమని ఆయా గ్రామాలనుంచి అనేక మహజర్లు పంపించినాము, అక్కడ ఉండేటటువంటి రెవిన్యూ అధికారులు రైతులవద్దకు వచ్చి డబ్బు తీసుకోవడమే కాని ఆ చెరువులకు మరమ్మతు ఏమైనదని వ్రాయమంటే, ఉన్నదున్నట్లు వ్రాయమంటే ఒక ఆఫీసరుకూడా ఈ విషయం వ్రాసి కలెక్టరు ముందు పెట్టలేదు. మేము శాసనసభ్యులం అంతా కలిసి, జిల్లాకలెక్టరుకు, జిల్లా ప్లానింగ్ కమిటీలోను, ఇంకా అనేకసార్లు ఈ చెరువుల మరమ్మతు విషయం చెప్పినాము అక్కడ పంటలు పాడైపోతున్నాయి

[*Smt T Lakshmikamtamma in the Chair*]

శాసనసభ్యులం కూడా అనేకసార్లు కలెక్టరుతో చెప్పినాకూడా మా జిల్లాలో చెరువులకు మరమ్మతులు ఇంతవరకు మాత్రం చేయలేదు. కాబట్టి

ఆ చెరువులకు వెంటనే మరమ్మతులు చేయించాలని ప్రభుత్వంవారిని కోరుతున్నాను ఇంతేకాకుండా ప్రభుత్వంవారికి, పన్నులు వేయడానికి పేదరైతులే దొరికారా ? ఈ రైతులమీద పన్నువేసి డబ్బు సంపాదించుకొనే విధానంకన్న ఇంకా ఎక్కువడబ్బు సంపాదించడానికి అనేకమైన విధానాలున్నాయని అనేక దఫాలు శాసనసభ్యులం చెప్పినాము కర్నూలులో ఉండేటపుడు, ఆంధ్ర రాష్ట్రంలో శ్రీ చెంగల్రాయ నాయుడుగారు, శ్రీ లక్ష్మణదాసు గారలతో ఒక కమిటీని వేశారు వారు చేసిన సూచనలు కొన్నింటినిమాత్రమే ప్రభుత్వం మన్నించి అమలుచేశారు కొన్నిటిని ఏమీచేయలేదు తమద్వారా ఈ పన్నుల గురించి నేను కొన్నిసూచనలు చేస్తున్నాను ఇపుడు సిమెంట్ బస్తాధర కనీసం 10 రూపాయలు ఉంటుంది, దానిని బ్లాక్‌మార్కెట్‌లో, 15, 20 రూపాయలకు అమ్ముతున్నారు పల్లెగ్రామాలలో చిన్నచిన్న పేదరైతులు సిమెంటుతో తమ ఇంటికి గడపవేసుకొని ఆ సున్నటిగడపపై సుఖంగా కూర్చుందామనే ఆశతో సిమెంట్‌కొరకు పిటీషన్ పట్టుకువెడితే, వారికి సిమెంటు అసలు ఖరీదుకు దొరుకుటలేదు దానిని ఇంకొక 5 రూపాయలు ఎక్కువగా తీసుకొని 15 రూపాయలకు బ్లాక్‌మార్కెట్‌లో అమ్ముతున్నపుడు, ఆ సిమెంటువర్తకుల లాంటి వారిమీద ప్రభుత్వం ఎందుకు హెచ్చుపన్నును వేయకూడదు ? అదేవిధంగా పట్టణాల్లో, అంటే ఇపుడు మన హైదరాబాద్‌లో పెద్దపెద్ద **hotels** ఉన్నాయి అక్కడ కాఫీ చాలా హెచ్చురేటుకు యిస్తున్నారు క్రిందనున్న బడ్డీ కాఫీవాడు కాఫీని ఒక అణాకే అమ్ముతుంటే ఇక్కడ ఉన్నటువంటి గోపీ హోటల్‌లో కాఫీ 0-3-6, మైసూర్ కేఫ్‌లో కాఫీ 0-2-6, అజంతాలో కాఫీ 0-3-0 లు చార్జి చేస్తున్నారు బడ్డీ కాఫీవాడు అంత తక్కువకు కాఫీ యిస్తుంటే, ఈ పెద్దహోటల్‌లో ఇంత ఎక్కువ అమ్ముతున్నారు అందుచేత ఇలాంటి పెద్ద హోటళ్ళమీద పన్నువేస్తే ప్రభుత్వానికి ఎంతోలాభం వస్తుంది అదేవిధంగా ఇక్కడ పెద్ద పెద్ద హోటళ్ళున్నాయి. గవర్నమెంట్ హాస్టల్‌లో ఒక పెద్దకుటుంబానికి సౌకర్యంగా ఉండటానికి రోజుకు ఒక రూపాయి అయితే, అదే కనుక పెద్ద హోటళ్ళలో ఒక రోజుకు 10 రూపాయలు చార్జి చేస్తారు. వాటిమీద మనిషికి ఒక రోజుకు ఒక రూపాయి పన్నువేస్తే ప్రభుత్వానికి ఎన్నో లక్షల రూపాయలు వస్తాయి. అలాగే మనదేశంలో ఎన్నో చిన్నకారులు కలవాళ్ళు చాలామంది ఉన్నారు అలాంటపుడు చిన్నకారులమీద పన్నువిధిస్తే ఎన్నో లక్షల రూపాయలు రాబడి ప్రభుత్వానికి వస్తుంది ఈ విధంగా ప్రభుత్వం పెద్ద రైతులమీద, చిన్నకారులు కలవాళ్ళమీద పన్నులు వేయడానికి బదులు చిన్నచిన్న రైతులమీద అధిక పన్నులు విధించి వారిని అనేక ఇబ్బందులకు గురిచేయుచున్నారు. ఈ చిన్నకారులు గల

వాళ్ళమీద, వర్తకులమీద పెద్దపెద్ద రైతులమీద వాళ్ళు ఇపుడు చెల్లించేపన్ను మీద ఒక వంతుకాని, లేకపోతే అర్థ వంతుకాని పన్ను వేసినట్లయితే ఎంతో డబ్బు వస్తుందని కూడా మా శాసనసభ్యులందరం తమద్వారా చెప్పుకుంటూనే ఉన్నాము కాని ఇపుడు, పెద్దరైతులమీద, ఇచ్చేవాళ్ళమీద పన్ను వేయటానికి ప్రభుత్వం తలచుటలేదు ఇటువైన అయినా నేను చెప్పినటువంటి వర్తకులమీద తరువాత చిన్న కారులమీద, కాఫీ హోటళ్ళమీద పన్ను వెయమని మనవి చేయుచున్నాను అసలు కాఫీనిషేధం మద్యపాన నిషేధంకంటే కూడా చాలా ఘనమైనది

ఏ పల్లెటూళ్ళలో చూచినప్పటికి కూడా కాఫీ, టీలే, కాబట్టి ఇలాంటి వాళ్లు బాగా డబ్బు సంపాదిస్తున్నారు కాబట్టి అలాంటి వారిమీద ఎంత పన్ను వేసినప్పటికి బలపరచడానికి మేము సిద్ధంగా ఉన్నాము ప్రభుత్వం ఈ విష యాలు దృష్టిలో ఉంచుకొని వెంటనే అమలు పరచగలదని ఆశిస్తున్నాను ఈ తరుణంలో 50 రూపాయిలు శిస్తు కట్టేవారిపై సర్చార్జీ లేకుండా చేయాలని ప్రభుత్వానికి మనవి చేస్తున్నాను

మా శ్రీకాకుళం జిల్లాలో రెవిన్యూ డిపార్టుమెంటు ఆఫీసులు చాల ఉన్నాయి అని నేను చెప్పకతప్పదు ఎందుకంటే, ఇదివరకు ఒక్కొక్క తాలూ కాకు ఒక తహశీల్దారుండేవారు ఆ తహశీల్దారు క్రింద ఒక ఇన్‌స్పెక్టరు ఉండి తాలూకా అంతా పరిపాలించేవాడు కాని ఇపుడు Estate Tahsildar ని వేశారు. వారిక్రింద ఎనమండుగురు ఇన్‌స్పెక్టర్లు, ఆ ఎనమండుగురు ఇన్‌స్పెక్ట ర్లకు ఎనమండుగురు ప్యూన్లు, తహశీల్దారు ఇంటివద్ద ఇద్దరు ప్యూన్లు ఉంటారు వారందరికి ఎంత డబ్బు ఖర్చవుతుందో తమరు ఆలోచించాలి. అటువంటి దుబారా ఖర్చు తగ్గించి అంతా ఒక తహశీల్దారు చూచుకుంటేచాలు, ఒక R. D. O చూచుకుంటేచాలు, నలుగురు ఇన్‌స్పెక్టర్లు చూచుకుంటేచాలు, ఎలాగూ గ్రామాల్లో మునసబు కరణాలు శిస్తులు వసూలు చేస్తున్నారు. వీరికి పని ఏమియు లేకపోవుటచే గ్రామాల్లోకి వెళ్లి 5 రూ. లు శిస్తుకట్టే వాడినుంచి 60 రూ. ల వరకు సర్చార్జి అని, అదని, శిస్తుల మూలంగా వసూలు చేస్తు న్నారు అని తమద్వారా మనవి చేస్తున్నాను. ఈ భూమి పన్ను అనేది ఒకే విధమయిన పన్ను, ఒక రూపాయకు పది రూపాయలు వేశామయ్యా, ఇది కట్టుకోవయ్యా, నీ బ్రతుకిది, మా బ్రతుకిది అని మనం తేల్చినట్లయితే ఆ రైతు భయపడకపోను. ప్రతిసారి రూపాయకు 5 కాన్లు అని, 0-4-0 అని, ఇంకేదో అని, పన్ను వేస్తే ఈ మునసబు, కరణాలు రూపాయికి 5 రూ.లు వేస్తున్నారు మేము ఎవరయినా ఏమన్నా అంటే మీ ప్రభుత్వమయ్యా, మీరు ఓట్లు ఇచ్చిన

వారు చేశారయ్యా ఈ సంతకాలు, మేమేమి చేస్తామయ్యా అని మునసబు కరణాల దగ్గరనుండి, తాలూకా రెవిన్యూ ఇన్‌స్పెక్టర్ల దగ్గరనుంచి అంతా కూడా మా ఎదుటనే propaganda చేస్తున్నారు అటువంటి అభాండాలు మామీద పెట్టకుండా ప్రభుత్వంవారే డైరక్టుగా చూచుకొని రైతులకు ఏవిధమైన అన్యాయాలు కలుగకుండా చూస్తారని ఆశిస్తూ ఇంతటితో విరమిస్తున్నాను

శ్రీ యన్ సి శేషాద్రి (రాయదుర్గం) అధ్యక్షా, గౌ॥ మంత్రిగారు ప్రవేశపెట్టిన ఈ భూమి శిస్తు సర్చార్జి బిల్లును నేను హృదయ పూర్వకంగా బలపరుస్తున్నాను ఈ బిల్లు ప్రవేశపెడుతూ మన రాష్ట్ర financial resources ఎక్కువ చేసుకోవడమే కాకుండా భూమి శిస్తు విధానంలో ఒక క్రమబద్ధమైన పద్ధతిని అమలుపరచడమే ఈ బిల్లుయొక్క ముఖ్యోద్దేశం అని మంత్రిగారన్నారు చాలా సంతోషం తీరా బిల్లులోకి వచ్చేసరికి, exemption limits దగ్గరకు వచ్చేసరికి 10 రూపాయల లోపు శిస్తు చెల్లించేవాళ్లకు ఏమీ సర్చార్జి లేదని, తరువాత 50 ఎకరాల దాకా కొంత, 100 ఎకరాలదాకా కొంత, 500 రూపాయలు కట్టేవారికి 0-8-0 వరకు ఈ విధంగా చేశారు అయితే ఇదివరలో ఆంధ్రరాష్ట్ర శాసనసభలో ప్రవేశపెట్టిన బిల్లులో కేవలం ఒక రూపాయి కట్టేవారికి మాత్రం exemption ఇచ్చి, అటుతరువాత ఒక అణా surcharge విధిస్తూ వచ్చినారు అపుడు ఈ బిల్లువల్ల 50 లక్షలో, 60 లక్షలో వస్తుందని అంచనా వేసుకున్నాం తీరా ఈ బిల్లు ప్రవేశపెట్టడంవల్ల మనకు వచ్చేఆదాయం చూచుకున్నట్లయితే 30 లక్షలో, 35 లక్షలో, పరిమితం అవుతున్నట్లు తెలుస్తోంది. అంతేకాక ఇదివరకు హైద్రాబాదు రాష్ట్రంలో ఉన్న వ్యవసాయాదాయపు చట్టాన్నికూడా ఇందులో repeal చేస్తున్నాము దానివల్ల వచ్చే ఆదాయంకూడ పోతుంది 10 రూ లు లోగా శిస్తు చెల్లించేవారికి relief ఇవ్వడం అవసరమనే విషయంపై ఈ సభలో ఉన్న అందరికి ఏకాభిప్రాయం ఉన్నదని నేను అనుకుంటున్నాను అందులో భేదాభిప్రాయములు ఉండడానికి ఏవిధమయిన అవకాశం లేదు

అయితే ఈ 10 రూ ల శిస్తు చెల్లించే పట్టాదార్లకు 0-10-0 వేస్తే చాలా భారమవుతుంది కాబట్టి ఈ 0-10-0 మాత్రం exempt చేస్తున్నామనడం నాకు సబబుగా కనిపించడంలేదు. మనం చిన్న కారు రైతులకు relief ఇవ్వ దలుచుకున్నట్లయితే, పూర్తిగా 10 రూ. లు మాఫీ చేసినట్లయితే దాని effect కనిపిస్తుంది కాని 10 రూ. లు 0-10-0 తగ్గించడంవలన ఒక moral effect కనపడుతుంధిగాని, material effect ఏమీ కనపడదని నేను భావిస్తున్నాను. ఎలాగూ పన్నులు వేస్తూవచ్చారు. మొన్ననే Wet Assessment Bill కూడా

తీసుకుని వచ్చారు 3, 4 ఎకరాలు భూమి ఉంటే వారికికూడా సర్చార్జి పడు తుంది. కాబట్టి చిన్న కారు రైతు ఎంతభూపరిమితి గలవాడు అనేదికూడా మనం యోచించవలసి ఉంటుంది

కాబట్టి State Financial resources ను increase చేసుకునే దానికి ఈ బిల్లు ఉద్దేశపరచినట్లయితే ఈ 10 రూ లు శిస్తు కట్టేవారికికూడా ఒక 0-1-0 ప్రకారం సర్చార్జి వేయవలసిందిగా నేను ప్రభుత్వాన్ని అభ్యర్థిస్తున్నాను నా ఉద్దేశం వారికి భారం పెంచాలని కాదు, దానివల్ల moral effect తప్ప material effect లేదని నేను ఇదివరలో చెప్పినాను కాబట్టి పై వాళ్ళకు కూడా వెయ్యాలనే నా ఉద్దేశం ఒక సం॥ నికి 10 రూ లు భూమిశిస్తు చెల్లించే రైతు 0-10-0 కట్టినట్లయితే దానివల్ల వానికి ఏమాత్రం relief ఉండదు, పోతే ప్రభుత్వానికి వచ్చేనష్టం చూచినట్లయితే కొన్ని లక్షలు ఉంటుందని నేను భావిస్తున్నాను

ఒక గౌ॥ సభ్యుడు భేదాభిప్రాయం ఏమీలేదా ?

శ్రీ యన్ సి. శేషాద్రి భేదాభిప్రాయంలేదు కాని, ఈ relief అవసరమా? ఈ relief ఒక relief గా పరిగణింపబడుతుందా అనే principle తో నేను మాట్లాడుతున్నాను కాబట్టి మాఫీచేయదలచుకొంటే 10 రూ లు పూర్తిగా మాఫీచేసినట్లయితే మేము చాల సంతోషిస్తాం, కాని 0-1-0 relief ఇస్తున్నాము, 0-10-0 పేదరైతులకు మిగిలిస్తున్నామంటే దానికి నేను ఎంతమాత్రం ఒప్పు కోను. 10 రూ లు శిస్తు చెల్లించేవారిపైన మనము 0-1-0 వసూలుచేసినట్లయితే అతనికి ఏ విధమయిన భారం ఉండదు మన ప్రభుత్వ బొక్కసానికి కొంత డబ్బు సేకరించినట్లవుతుంది

ఇంకొక విషయం- ఫిర్కాకు పరిమితంచేసే విషయం ఈ బిల్లులో ఉంది. అందులో కొన్ని ఇబ్బందులున్నాయి ముమ్ముందు ఒక తాలూకా గాని, ఒక జిల్లా గాని, యావత్ రాష్ట్రంలో ఉండే భూమిని పరిగణిస్తామని వారు హామీ ఇచ్చారు అది ఎంత త్వరలో చేస్తే అంతమంచిదని నేను భావిస్తున్నాను అంతే కాకుండా ఆర్డినెన్సు మొన్ననే జారీఅయింది ఈ ఆర్డినెన్సులో 20 ఎకరాలకు మించి భూమి ఉన్నవారు అందరు తమ లెక్కలను ప్రభుత్వానికి ఇవ్వవలసిందిగా చెప్పుట వల్ల ప్రజలలో 20 ఎకరాలకు ceiling పెడతారేమోనని అభిప్రాయం కలిగింది. ఈ నెలన్నరలోపల కమతాలన్నీ తగ్గిపోతున్నాయి. ప్రభుత్వంవారు ఏ ప్రాతిపదిక ననుసరించి లెక్కలు వేస్తున్నారో ఆ లెక్కల ప్రకారం మనకు డబ్బు రావడానికి అవకాశంలేదని, నేను భావిస్తున్నాను. ఎందుకంటే ఈ 20

ఎకరాల holdings చాలా తగ్గిపోయినాయి 5 ఎకరాలు, 10 ఎకరాలు, 15 ఎకరాలు ఈ విధంగా వస్తున్నాయి మా అనంతపురం జిల్లాలో చూచినట్లయితే ఎఱ్ఱనేలలపైన 0-2-0, 0-4-0 కంటే భూమిశిస్తు జాస్తిగాలేదు అటువంటప్పుడు 20 ఎకరాలు ఉన్నప్పటికి 5 రూ లు land revenue కడుతున్నాడు 5 రూ లు పైన మనం ఏమాత్రం surcharge వసూలుచేయడంలేదు. ప్రభుత్వం ఏ లెక్కలపైనయితే మనకు ఫలానా ఆదాయంవస్తుందని లెక్కలు వేస్తున్నదో, అది కూడా రాదని నేను శంకిస్తున్నాను కాబట్టి 10 రూ ల వారికి surcharge వేసినట్లయితే ప్రభుత్వానికి డబ్బు రావచ్చుని భావిస్తున్నాను.

Land surcharge వసూలు చేసేటప్పుడు surcharge మొత్తాన్ని land revenue కి కలిపి ఒక నోటీసు ఇవ్వడం, surcharge ఎంత ? Land Revenue ఎంత ? అని విశదపరచకపోవడం, ఇవన్నీ మామూలుగా జరిగే విషయాలు అంతేకాకుండా ఈ కిస్తీ రూకలు జనవరి, ఫిబ్రవరి, మార్చి నెలలలో వసూలు చేయడం వాడుక. జూన్, జులై నెలలలో ఈ సర్చార్జి వస్తూంటుంది కాబట్టి మనం pay చేసే land revenue మీద surcharge వస్తోందా, లేదా అనే విషయం తెలుసుకోడానికి రైతుకు అవకాశం లేకుండాపోయింది రేపు ఈ డిమాండు నోటీసులో కూడా clear గా ఇంత land revenue, దానిమీద ఇంత surcharge అని వేరే columns పెట్టి డిమాండు నోటీసులు serve చేసినట్లయితే నేను ఇంత భూమి మీద ఇంత surcharge కట్టినానని కడుతున్నవారు తెలుసుకోడానికి అవకాశం ఉంటుందని ఈ Rules frame చేసే సందర్భంలో గమనించకోరుతున్నాను.

శ్రీ జి. నరసింహమూర్తి (అమలాపురం జనరల్) మాననీయ అధ్యక్షులారా, రెవిన్యూ శాఖామాత్యులు తెచ్చిన భూమిశిస్తుపై సర్‌ఛార్జి విధింపు చిత్తు చట్టమును విశిష్ట సమితి అభిప్రాయములకొరకు పంపకోరిన ప్రతిపాదనను ఆమోదిస్తూ, దీనిమీద నాకు గల కొన్ని అభిప్రాయాలను తమద్వారా మనవి చేస్తాను. ప్రజలనుండి ఈ పన్ను వసూలుచేసి ప్రజాశ్రేయస్సుకొరకు ఖర్చు పెట్టడమనేది, దీని మూల సిద్ధాంతం ప్రజాశ్రేయస్సు కాంక్షించి, దీనిని అభివృద్ధి కార్యకలపాలకు ఖర్చుపెట్టేటప్పుడు ఈ పన్నును విధించరాదుఅనే భావం అభివృద్ధికాములకు ఉండకూడదనే అభిప్రాయం కలవాడను. ఇదివరలో ఒక బిల్లు రెవిన్యూ శాఖామాత్యులచేత ప్రవేశపెట్టబడిన, నీటితీరువ అదనపు పన్ను బిల్లు. మన సభఎదుట వచ్చియున్నది. రేపో, మర్నాడో యింకొకబిల్లు—వాణిజ్య పంటలకు పన్నువిధించుటకు, రాబైయున్నది. వ్యవసాయంమీదనే బ్రతికే రైతు మీద ఒకే మొత్తమును ఒక్కసారి విధించకుండా, వివిధ రూపాలలో, వివిధ

తరహాలలో, వివిధ నామకరణాలతో మోయరాని పన్నుల భారమును, రైతు మీద విధించుటకు గౌ రెవిన్యూ మంత్రిగారు యీ బిల్లులు తెచ్చి మన ఆమోదమును కోరుతున్నారు. రైతుపై యిదివరకే పన్నులభారం పెరిగియున్నది దానిని యింకా అధికం చేస్తున్నారంటే, అది రైతుకు మోయరాని భారముగా తయారవుతున్నదని మనవి చేస్తున్నాను భూమిపన్ను అంటే భూమికి, జలానికి, ఆకాశానికి- యీ మూడింటికి సంబంధంఉన్నది అందుచేత ఈ పన్ను, పరోక్షంగా ఆకాశంమీద కూడ విధిస్తున్నట్లు భావించవలసి యున్నది కొన్ని భూములకు కాల్వలద్వారా, కొన్ని భూములకు చెరువులద్వారా నీరు వస్తుంది ఈ కాల్వలకు, చెరువులకు- అన్నింటికి ఆకాశంనుంచి నీరు వస్తున్నది నీటి తీరువ హెచ్చింపుఅంటే భగవంతుడు యిచ్చిన, ఆకాశంమీద ఉన్న గాలి, నీరు, భూమి- వీటి అన్నింటిమీద పన్ను విధిస్తున్నారు ఎన్ని పన్నులైనా విధించవచ్చును గాని, అవి రైతు భరించగలిగినట్లు ఉండాలని మనవి చేస్తున్నాను అందుచేత యిక ముందునుంచి ఈ పన్ను విధించుట అనేది, భూమికిగాని, నీటికిగాని, గాలికి గాని, ఆకాశమునకు గాని, మనిషికి గాని ఉండకూడదని నా అభిప్రాయం నిన్న ఈ విషయం మా పార్టీనాయకులు శ్రీ రామకృష్ణరాజుగారు ప్రతిపాదించారు దానిని నేను హృదయపూర్వకంగా బలపరుస్తున్నాను భూమిపై గాని, వర్తకంవలన గాని, లేక ఏ కృషివలనైనా గాని దేశంలో ప్రజలకు వచ్చే ఆదాయంపై పన్ను విధిస్తే, హెచ్చు ఆదాయం వచ్చేవారు హెచ్చు పన్ను, కొద్ది ఆదాయం వచ్చేవారు కొద్ది పన్ను యిచ్చుకుంటారు ఆ విధంగా పన్ను విధించాలి తప్ప భూమికి గాని, నీటికి గాని, పన్నువిధించే ఈ పురాతన పద్ధతి రద్దు చేయాలని శ్రీరామకృష్ణరాజుగారు చేసిన ప్రతిపాదన బలపరుస్తున్నాను. గౌరవసభ్యులు గున్నయ్యగారు చెప్పారు హోటల్సు పెట్టి వేలకు వేలు సంపాదిస్తున్నారని అన్నారు. వాళ్ళకు పన్నులేదు, పట్టణాలలో ఉన్నవారు వేలకువేలు సంపాయిస్తున్నారు. వారికి పన్నులేదు, రైతుకు పన్ను ఏమిటి అని అడుగుతారు నిజమే. అది సమంజసమైన సూచన. భూమిని పెట్టుబడిగా పెట్టుకుంటున్నాడు - రైతు బుద్ధికుశలతను పెట్టుబడిగా పెట్టుకుని సంపాదించుకుంటున్నారు - చేనేతవారు అలాగే తన భుజశక్తిని, శ్రమను పెట్టుబడిగా పెట్టుకు సంపాయించుకుంటున్నాడు - వ్యవసాయ కూలీ. ఎందరు ఆదాయాన్ని సంపాయించుకుంటున్నా- యిందులో రెండు రకాలు కనిపిస్తున్నాయి , (1) తన భార్యాబిడ్డలు సుఖంగా బ్రతకటంకోసం సంపాదించుట. (2) తమ అవసరాలకు మించి అధికంగా సంపాయించి, దేశంయొక్క ఉపయోగంకోసం వినియోగించకుండా, తన స్వార్థానికి కూడా కాకుండా, ఒక మూలపెట్టే సంపాదన. అందరూ అధికంగా సౌఖ్యం పొందాలనేది ధ్యేయం.

కుటుంబ పోషణకు సంపాదించుకునే స్వల్ప ఆదాయం గల రైతు- రు 50 లు పన్ను చెల్లిస్తున్నాడంటే సాధారణంగా అతనికి 1½, 2 ఎకరాల భూమిఉండి ఉంటుంది ఆ రెండు ఎకరాలమీదే ఆతని కృషి. వేరే చదువులేదు, శాస్త్ర విజ్ఞానంలేదు, మిన్ను, మన్ను, నమ్ముకొని అహోరాత్రులు కష్టపడి పనిచేస్తూ ఉంటాడు అతనికి వచ్చే ఆదాయం రు 400 అయితే ఈ మూడు తరహాల పన్నులు, యింకా లోగడ ఆర్థిక మంత్రిగారు పెంపుచేసిన పన్నులు యివన్నీ చెల్లించుకోవడంతో, యించుమించుగా అతనికి మిగిలేది ఏమీ ఉండదు పన్నులు అసలే వద్దని చెప్పుటలేదు ఇచ్చుకునే సామర్థ్యం ఉన్నవారిమీద విధించవచ్చును గాని, సామర్థ్యం లేనివారిమీద విధించకూడదని మంత్రిగారికి మనవిచేస్తున్నాను. మొన్న నీటి తీరువకు సంబంధించిన పన్ను ప్రతిపాదిస్తూ, రెవిన్యూ మంత్రిగారు యిదివరకు ఎప్పుడో ఎకరానికి 8 బస్తాలు వచ్చాయని, యిప్పుడు 14 బస్తాలు వస్తున్నాయని సెలవిచ్చారు కాని నాకు తెలిసిన విషయములనుబట్టి 8 బస్తాలు, 14 బస్తాలు అయినట్లు కాగితాలమీదనే కాని బ్రహ్మయ్యగారికి ఏటా ఎన్ని బస్తాలు వచ్చేవో వీరికి ఏమితెలుసు?

శ్రీ కె. వెంకటరావు కీర్తిశేషులైన మా నాన్నగారి పేరు తీసుకు వచ్చారు ఆయన వ్యవసాయం చేసినన్నాళ్లు మా పొలాలు బాగా పండాయి, ముందుముందు ఏమైనా తగ్గుతాయేమో తెలియదు నాకు ఇంకోసంగతికూడా తెలుసు ఆయనద్వారా నాకు సంక్రమించిన నడిపూడిలోని భూమికి ఎకరానికి 500 రూ cash ఇస్తున్నాను అది చాలా high rate అని యీ ఏడే నేను రిమిషన్ ఇస్తున్నాను. మా నాన్నగారు పంట పండించగలరు నరసింహామూర్తి ఆయనపేరు ఎరుగునుగాని, ఆయనయొక్క స్వభావమును ఆయనయొక్క శక్తిని ఎరుగడు

శ్రీ జి. నరసింహామూర్తి. అధ్యక్షా, నేను నమ్మినటువంటి, అసత్యం కానటువంటి విషయాలు తమకు మనవిచేయటానికి నాకు అధికారం ఉన్నది కనుక, నేను నమ్మినవిషయాన్ని నాకు తెలిసినవిషయాన్ని చెప్పాను. వారి భూములకు అటువంటి మక్తాలు ఉన్నమాట నిజం. వారు ఏటేటా వందబస్తాలు ఇవ్వవలసిన రైతుకు 50 బస్తాలు "రైటాఫ్" చేసిన ఉదాహరణలు చెబుతాను.

ఒకవైపున మనం ఆహారధాన్యాల ధరలు తగ్గాలంటున్నాము. మరోక వైపున పన్నులు పెరగాలంటున్నాము. నీటిపారుదల సౌకర్యాలు కావాలంటే ప్రభుత్వందగ్గర డబ్బు లేదంటున్నాము ఎన్నిసార్లు పన్నువేసినా, కృష్ణా గోదావరి నదులక్రింద సాగయ్యే ప్రాంతంలో పరోక్షంగా హెచ్చుభాగం పన్ను పడటం జరుగుతోంది. కాని అక్కడ కావలసినటువంటి మురుగునీరు

పోయే సౌకర్యాలు వగైరా, యీపట్నామాత్రంకూడా చేయకపోవటం జరుగుతున్నది అందుకోరకు ప్రభుత్వం డబ్బు కేటాయించవచ్చును కాని ఆ డబ్బులో ఎంతో మొత్తం వ్యర్థంగా పోతోంది ఆ విధంగా వ్యర్థంగా పోవటాన్ని అరికట్టటానికి ప్రభుత్వం ప్రయత్నించటంలేదు ఈ పరిస్థితిలో దేశంలో అసంతృప్తి ఎక్కువైనట్లయితే, అందుకు బాధ్యత వహించవలసినవారు, డాక్టర్ గోపాలరెడ్డిగారు, కళా వెంకటరావుగారు అని నా నిశ్చితాభిప్రాయం కారణం ఏమిటంటే, వారు విశేషఅనుభవం గడించినవారు, పెద్దలు. మంచి జరిగినా, చెడు జరిగినా, అందుకు వారిద్దరూ బాధ్యత వహించక తప్పదు కాబట్టి వీరు ఉభయులు కడు దీక్షతోటి, యీ భూమిమీద, నీటిమీద పన్ను రద్దుచేసి, సక్రమమైన పద్ధతిలో వ్యవసాయ ఆదాయంమీద పన్ను వేయాలని మనవిచేస్తూ, యీ అవకాశం ఇచ్చినందుకు తమకు ధన్యవాదాలు అర్పిస్తూ ఇంతటితో ముగిస్తున్నాను.

శ్రీ జి. జగన్నాధరాజు (ఉండి) అధ్యక్షా, యీ టాక్సేషన్ విధానం నాకు రెండు విధాలుగా ఆశాభంగం కలుగజేసింది. రెవిన్యూ మినిస్టర్ గారు గట్టివారని, రైతుబిడ్డ అని, ఫైనాన్స్ మినిస్టర్ గారు చెప్పిన ప్రకారంగా లొంగిపోరనే అభిప్రాయంతో నేను ఉంటూండేవాడిని కాని యీ పన్నుల ప్రపోజల్సు చూసిన తరువాత, రెవిన్యూ మంత్రిగారు ఫైనాన్సు మినిస్టర్ గారు ఎలా చెబితే అలా అంగీకరించారని తెలుస్తున్నది అలా ఎప్పుడూ జరుగుతుందని నేను అనుకోలేదు ఆ విధంగా ఒక ఆశాభంగము అయింది - మూడు నాలుగు రోజుల క్రిందట ఉన్న హడావుడి చూస్తే కాంగ్రెసు పార్టీలో ఉన్న రెండు గ్రూపులు ఎలాగో అలా టాక్సేషన్ రాకుండా చూస్తాయని అనుకొన్నాను కాని ఏమాత్రం నాకు లాభం లేకపోయింది - అది రెండవ ఆశాభంగము. ఈ రెండు ఆశాభంగాలు నాకు కలిగాయి **West Godavari, East Godavari,** కృష్ణా జిల్లాల బేసెస్ మీద, విశాఖపట్నం జిల్లాలో కూడా టాక్సేషన్ రావటం చాలా అన్యాయమని మనవి చేస్తున్నాను. **West Godavari, East Godavari, Krishna districts** లో ఎకరానికి 18 బస్తాలు రావచ్చును; 20 బస్తాలు రావచ్చును. 25 బస్తాలు రావచ్చును. కాని విశాఖపట్నం జిల్లాలో ఒక బస్తానే రాబడి ఉన్నది 18 బస్తాలు వచ్చినపుడు 5 రెట్లు పన్ను వేసినా ఇబ్బందిలేదు కాని ఒక బస్తా రాబడి వచ్చే విశాఖపట్నం జిల్లాలో ఎంత ఇబ్బంది ఉంటుందో ఆలోచించాలి ప్రస్తుతం విశాఖపట్నం జిల్లాలో పన్ను 15 రూ మొదలుకొని 25 రూ. వరకు వస్తుంది - నేను రైతుగా 16 రూ. లు చెల్లిస్తున్నాను. ఇప్పుడు విధించింది ఒక్క పన్ను కాదు, మూడు పన్నులు విధించారు. **Wet land** మీద

37½% excess water tax 50%, సర్చార్జి పన్ను, కమర్షియల్ క్రాప్స్ మీద 5 రూపాయలు పన్ను విధించబడుతోంది ఇప్పుడు ప్రభుత్వంవారు ఎంత అదనంగా పన్ను వేశారో గమనించవలసి ఉన్నది నేను విశాఖపట్నం జిల్లా గురించి మనవి చేస్తాను అక్కడ రైతులకు గవర్నమెంటువారు చేస్తున్న సదుపాయం ఎట్టిదీలేదని మనవి చేస్తున్నాను 10, 15 సంవత్సరాలు క్రితం "రామపాదసాగర్ ప్రాజెక్టు వస్తోంది, చచ్చిపోవద్దు బ్రతికిఉండండి" అనిచెప్పారు నేను కాదు, నాబిడ్డలుకాదు, నామనుమలు, నామునిమనుమలైనా రామపాదసాగర్ ప్రాజెక్టు చూస్తారా అన్నది అనుమానంగా ఉన్నది విశాఖపట్నం జిల్లాకు ఆశ పెట్టి యీ పన్నులు విధించటం సరైంది కాదని చెబుతున్నాను, First Five Year Plan, Second Five Year Plan క్రింద ఎంతో సొమ్ము ఖర్చు పెడుతున్నారు నాకు ఇచ్చిన పుస్తకంలో చూస్తే 1st Five Year Plan, 2nd Five Year Plan క్రింద విశాఖజిల్లాలో ఖర్చుపెడుతున్నది ఇర్రిగేషన్ సిస్టమ్‌లో రెండు ఐటమ్స్ కనపడుతున్నవి ఒకటి గంభీరంగడ్డ పేరుమాత్రం మహా గంభీరంగా ఉంది అమాయకులు విశ్వనాథం పంతులుగారు, అప్పుడు ఫైనాన్సు మినిస్టర్‌గా ఉన్నప్పుడు, ఆయన ముఖంచూసి విశాఖపట్నం జిల్లాలో యీ గంభీరంగడ్డను శాంక్షన్ చేశారు దానికి అసలు ఛానల్ ఇంకా తయారుకాలేదు సైడ్ కాలువగా ఒక చెరువులో పెట్టారు దానిక్రింద ఇప్పుడు సాగు అవుతున్నది వంద ఎకరాలు. అంతకంటే ఎక్కువ సాగు కావటంలేదు 57-58 సం॥లో దానికోసం ప్రొవైడ్‌చేసింది 5 వేల రూపాయలు. 2nd Five Year Plan లో 2 ప్రొవిజన్సు చేశారు ఒకటి గంభీరంగడ్డ దానికి మొదటి సంవత్సరం 5 వేల రూపాయలు శాంక్షన్ చేశారు దానిక్రింద ఖర్చు మొత్తం 56 వేలు అన్నారు. రెండవది, ఇంకొక Gokivada గడ్డ ఉన్నది దానికి 4 వేలు ప్రొవైడ్ చేశారు విశాఖపట్నం జిల్లాకు 57-58 వ సం॥లో ప్రొవైడ్ చేసింది మొత్తం 9 వేల రూపాయలు 5 సంవత్సరాలకు మొత్తం డబ్బు 56 వేలు +13 వేలు =69 వేలు ప్రొవైడ్ చేశారు ఆంధ్రప్రదేశ్‌లో విశాఖపట్నం జిల్లా ఎంత విస్తీర్ణం కలిగియున్నది? విశాఖపట్టణం జిల్లాలో 5 సంవత్సరాలకు ఇరిగేషన్ కోసము 69 వేల రూపాయలు మాత్రమే ప్రొవైడ్ చేయటం ఏమిన్యాయమని అడుగుతున్నాను. దాంట్లో ఎంతమాత్రం న్యాయంలేదు. ప్రభుత్వంవారు అలా ఎందుకుచేశారో తెలియదు దానికి కారణం చెప్పలేను. వాకు తట్టినా, నేను చెప్పదలచుకోలేదు. మొత్తంమీద విశాఖపట్నం జిల్లాపై చిరుకన్ను వేశారు. ఆ విషయంలో అనుమానంలేదు. 5 సంవత్సరాల ప్లానులో, విశాఖపట్నం జిల్లాలో, మేజర్ ప్రాజెక్టులకు, మీడియమ్ ప్రాజెక్టులకు, మైనర్ ప్రాజెక్టులకు 69 వేల రూపాయలు శాంక్షన్

చేయటం అన్నది చాలా అద్భుతంగా ఉన్నది ఇంకొక విషయం తెలియజేస్తాను ఎగ్రికల్చరల్ డిపార్టుమెంటు ఉన్నది దీనివర్కింగ్ చూస్తే ఆశ్చర్యంగా ఉన్నది మెన్యూర్స్ సప్లయి చేయటం గురించి చెబుతాను క్రితం సంవత్సరం ఫ్రీమెన్యూర్స్ సప్లయి చేశారు, ఈ సంవత్సరం చేయలేదు ఫ్రీమెన్యూర్స్ ఇవ్వకపోతే ఇవ్వకపోయారు, డబ్బు ఇచ్చి కొనుక్కొందామన్నా మాకు కావలసిన అమోనియం సల్ఫేటు దొరకలేదు విశాఖపట్నంలాంటి పెద్దటౌనులో కూడా అమోనియం సల్ఫేటు లేదు మాకు అమోనియం సల్ఫేటు కావాలంటే, విశాఖపట్నానికి 13 మైళ్ళ దూరంలో ఉన్న పెందుర్తి వెళ్ళి కొనుక్కోమని ఆర్డరు ఇచ్చారు విశాఖపట్నంలాంటి పెద్దటౌనులో, జిల్లాకేంద్రములో మాకు కావలసిన అమోనియం సల్ఫేటు, మెన్యూర్స్ దొరకకుండా పోయాయి రైతులకు సౌకర్యాలు కలిగించటంలో ఎగ్రికల్చరల్ డిపార్టుమెంటు యీ విధంగా పనిచేస్తోంది ఇటువంటప్పుడు రైతులపైన యీ పన్ను విధించటం ఏమిసబబు?

అక్కడి భూమికి పనికివచ్చే సీడ్సు ఇవ్వటంలేదు విశాఖపట్నం సాయిల్ కు ఏమీ సీడ్సు పనికివస్తాయో, అవి పంపించటంలేదు ఇతరజిల్లాలలో మిగిలిపోయిన సీడ్స్ విశాఖపట్నం పంపుతున్నారు

ఈ సంవత్సరం అక్కడ వర్షాలు లేవని అందరికీ తెలుసు విశాఖపట్నం జిల్లాలో వర్షాలులేవు. అక్టోబర్ ఆఖరువారంలో కొద్దిగా వర్షాలు పడినవి వర్షాలు లేకపోగా విపరీతమైన ఎండలు కాస్తున్నవి ప్రజలు భరించలేని ఎండలు కాస్తున్నవి

ఆ ఎండలో 5 H. P motor driven pump పెట్టి ఒక్కమూడుఎకరాలు అయినా చేయలేకపోయినాను అప్పుడు water supply ఎక్కువగ కూడ ఉన్నది. అలాంటి పరిస్థితులలోనే late corp వచ్చే సమయములో సాధారణముగ insect pests start అవుతాయి Insects వచ్చి crop ను పూర్తిగా చిత్తుపట్టివేసింది. ఆ సమయములో ఎవరైనా మనిషి కనబడుతాడేమోనని చూచి, కనబడితే, ఇదుగో యీడబ్బు తీసుకుని వెళ్ళి గనాక్సిన్ పౌడరుతెచ్చి మీ పొలములో చల్లమని అడుగుదామని చూచాను ఎవరు కనబడలేదు, చివరకు farm వెళ్ళి వాళ్లకు చెబితే, వాళ్లకు పదిరోజులదాకా తీరుబడికాలేదు. అక్కడ farm లో field పైన ఒక్కడే మేస్త్రీ ఉన్నాడు. అక్కడ మనుష్యులు ఎక్కువమంది ఎందుకు లేరు అని కనుక్కుంటే, తాలూకాకు ఒక్కడే మేస్త్రీ, ఒక్కడే field man ఉంటాడట. తాలూకా కంతటికి ఒక్కడు ఉంటే, యిలాంటి పనులు ఎట్లా జరుగుతాయి? దీన్ని బట్టి చూస్తే అక్కడ Agricultural Department లో

staff చాలా insufficient గా కనబడుతున్నది ఆ సమయములో ప్రతివాడు కూడ వీళ్ల కోసము ఎదురుచూస్తూ ఉన్నప్పుడు తగినంతమంది లేకపోవడమువల్ల పనులు జరగడములేదు అక్కడ staff inefficiency వల్లనో, insufficient staff వల్లనో, అవసరము వచ్చినప్పుడు మన పనులు కాకపోవడము వల్ల ఆ పొలము అంతా పాడై పోయింది ఈ విషయము అక్కడ అందరికీ తెలుసు నిజానికి చూస్తే farm లో ఉన్నవారికి పనులు ఉంటాయి ఈ విధముగ insects పట్టినప్పుడు వాళ్ళ వల్ల కొంచెము కూడ సహాయములేకపోయింది అయినను ఆ Agriculture Department వారిని నేను blame చేయుటలేదు అక్కడ insufficient staff ఉండడము వల్ల వాళ్ళ యొక్క సహాయము మాకు అందలేదు. ఈ సంగతి మొన్న జరిగిన Planning Committee మీటింగులో చెప్పాను. ఆసమయములో Finance Minister గారు దగ్గరలోలేరు అప్పుడు ఆ Planning Department లో ఉన్న ఒక High official యీసంగతి విని Director of Agriculture ను పిలిచి, ఏమయ్యా! యీ పనులు మీ staff కు నేర్పించలేక పోయినారా? వారు ఏదో ఒక pump ను కొనుక్కొని మీ సహాయము కోరితే, అంతమాత్రము సహాయము చేయలేకపోయినారా అని వారిని అడిగారు ప్రభుత్వము land reforms ను ప్రవేశపెట్టుతామని అంటున్నారు అవి వచ్చినప్పుడు సీలింగు 20 ఎకరాలకు పెట్టుతారో, పదో, అయిదో ఎన్ని ఎకరాలకు పెట్టబోతారో తెలియదు. ఆ High Official, Director of Agriculture, కు చెబితే, ఆయన నీవు agriculture staff ను maintain చేస్తే సహాయము యిస్తానన్నాడు మూడుఎకరాలు వ్యవసాయము చేసుకునేవాడిని, నేను Agriculture Departmental staff ను ఎట్లా maintain చేయగలను? ఆ మోస్తరుగా కాకుండా Agriculture Department వారే కొంచెము శ్రద్ధతీసుకుని, దానికి Finance Minister గారు తగినంత finance ను provide చేసి రైతులకు కావలసిన సహాయము తీసుకోటానికి facilities కలుగజేసి ప్రభుత్వమే సహాయముచేస్తే రైతులలో ఎవరు కూడ విచారపడేవారు ఉండరు. ఇదే నేను ప్రభుత్వమునకు చేసే మనవి

శ్రీ జె. బత్రయ్య (పెనుగొండ): అధ్యక్షా, ఈ రోజున మన ఎదుట వున్నది మన రెవిన్యూమంత్రి కళా వెంకట్రావుగారు సెలెక్టుకమిటీకి పంపటానికి ఆమోదించమని కోరుతూ ప్రతిపాదించిన బిల్లు దీనికి నేను అంగీకరిస్తున్నాను. ఎప్పటికైనా ప్రజాప్రతినిధులుగా యిక్కడ ఉన్న శాసనసభ్యులు, ప్రజలు అందరుకూడా ఒకేరకమైన అభిప్రాయముతో ఇది ఆమోదిస్తారని నేను అనుకుంటున్నాను. ఈ బిల్లు మంత్రివర్గమువారు న్యాయదృష్టితో తయారు

చేయించారు దీనిని సెలక్టుకమిటీలో కూడ న్యాయదృష్టితో పరిశీలిస్తారని అనుకుంటాను ఏ బిల్లు అయితే న్యాయదృష్టితో తయారుచేయబడుతుందో, అదే మనకు ఎక్కువ ప్రయోజనకరమవుతుంది ఎప్పటికైనా మనకు అలాంటి బిల్లే కావాలి గనుక, యిప్పుడు దీన్ని ఆమోదించటానికి ఆలస్యముచేస్తే ఏమి ప్రయోజనము లేదు ఇక మనఎదుట ఉన్న బిల్లు సూచించే surcharge పన్నును ఇకముందు continue చేయకూడదని నా అభిప్రాయము గతంలో ఒకసారి surcharge పన్ను వేశారు ఇప్పుడు మరల surcharge వేసేటట్లైతే రైతుకు పన్నుభారము ఎక్కువ అవుతుంది ఇప్పటికే రైతుకు ఖర్చులు ఎక్కువగా ఉన్నవి ఇప్పటికే పన్ను భరించలేకుండ ఉన్నాడు రైతు తన వ్యవసాయమునకు కావలసిన Agricultural implements, ఎరువులు వగైరాలు ఎక్కువ ధరలుపెట్టి కొనుక్కోవలసి వస్తున్నది వాటికిగూడ ధరలు పెరిగినవి వ్యవసాయ ఖర్చులు ఎక్కువైనవి వీటికితోడు పశువులకు ధరకూడ పెరిగింది ఈ కారణములవల్ల రైతు యిక ఏ విధమైన పన్నుకూడ భరించలేడు అని నేను గట్టిగా మంత్రిగారికి చెబుతున్నాను ఇప్పటికే రైతు ఋణభారముతో బాధ పడుతున్నాడు ఇలాంటి సందర్భములో ఇంకను యీ surcharge పన్నును విధించడము న్యాయముకాదు రైతు ఋణభారమునుంచి విముక్తి చెందటానికి ఆస్కారము లేకుండా పోతాడు ఈ విషయము మంత్రిగారు గుర్తించుతారని ఆశిస్తున్నాను ఈ కారణమే కాకుండ మరొక కారణము వల్లకూడా యికముందు ఎలాంటి పన్ను వేయటానికి వీలులేదు గతములో ప్రభుత్వము surcharge పన్ను విధించేటప్పుడు యీ పన్ను యీ ఒక్క సం॥ నకు మాత్రమే వేస్తున్నాము, ఇకముందు వేయబోము అని మంత్రిగారు వాగ్దానము చేశారు దీనివల్ల యికమీదట పన్ను అనేది ప్రభుత్వము విధించదు, అని గట్టినమ్మకము తోచి, ఆ నమ్మకముతో ఏకష్టమో పడి యిప్పటివరకు విధిస్తున్న పన్నులు కట్టుకుంటున్నాడు అలాంటి సందర్భములో యిప్పుడు మరల యీ surcharge పన్ను విధించేటట్లయితే, రైతుకు ప్రభుత్వముమీద నమ్మకము పోతుంది ఒకవేళ వేసినను, అది నెరవేర్చబడగలదా అనే అనుమానము నాకు కలుగుతున్నది. రైతు తప్పక ప్రతిఘటిస్తాడు ఇదిగాక ప్రభుత్వము యిచ్చిన వాగ్దానమును బట్టి శాసనసభ్యులు వాళ్ళయొక్క నియోజకవర్గములలో ప్రజలకు వచ్చిచెప్పారు దానివల్ల వాళ్ళకు గట్టినమ్మకము ఏర్పడింది అదిగాక ప్రభుత్వమువల్ల రైతులకు కావలసిన పనులు ఎన్నో జరగవలసియున్నవి ఇప్పటివరకు వేసిన పన్ను భరించండి, ఇకమీదట పన్నులు ఉండవు అని చెప్పడమువల్ల వాళ్ళు ఆమాట నమ్మియున్నారు. ఇప్పుడు యీ Surcharge పన్నువేసేటట్లయితే, రేపు శాసన సభ్యులు ప్రజల వద్దకు

వెళ్లినప్పుడు, మీరు ఎట్లా ప్యాసుచేశారు అని అడిగితే, శాసన సభ్యులు వాళ్లకు జవాబు చెప్పలేని స్థితిలో ఉంటారు శాసన సభ్యులు ప్రజల వద్దకు వెళ్లకుండ వేరొక మార్గములేదు ఇక ఏ మాటకూడా సభ్యులు చెబితే వాళ్లు నమ్మరు ఇంతవరకు జరిగిన యీ నాలుగు రోజుల చర్చచూస్తే, సభ్యులు వారికి తోచిన సలహాలు చెప్పారు అయినప్పటికినీ యీ బిల్లుకు ఎక్కువ కాలము వినియోగించ నవసరములేదు గనుక నేను మరొక్క విషయము మాత్రము చెప్ప దలచుకున్నాను రైతుకు అవసరమైన ఎరువులు, వ్యవసాయ పనిముట్లు, చౌక ధరలకు ప్రభుత్వము సప్లయి చేయించక పోవడమువల్ల, వాళ్లకు యివి రావలసిన ధరలకు దొరకడములేదు ఈ మధ్య కేంద్ర ప్రభుత్వమువారు Mehtha Committee అని వేసింది ఆ కమిటీ విచారణ జరిపి రేపు నవంబరు నెల వచ్చేలోగా వీటికి ధరల స్థిరీకరణ చేస్తామని చెప్పారు కాని యింతవరకు ధరల నిర్ణయము జరగలేదు ప్రస్తుత పరిస్థితులు ఎట్లాఉన్నవి అంటే, డెల్టా ఏరియాలో బసంగి ధాన్యమువచ్చి మార్కెటులో అమ్ముడు పోవటానికి నిలిచి యున్నది. ఆ ధాన్యము బస్తా ఒకటికి 17, 18 రూపాయలకంటె ఎక్కువ ఖరీదుకు ఎవ్వరుకూడ కొనటానికి ముందుకు రావడములేదు అందులో పొదుపు ఉద్యమము సాగుతున్న యీ సమయములో, యీ ధాన్యానికి ధరను నిర్ణయము చేయక పోవడమువల్ల, ధాన్యము అమ్ముడుపోక నిలవ ఉండిన కారణమువల్ల రైతుకు నష్టము వస్తున్నది ఇక పది రోజులలో ఆరు మాసముల పంట రాబోతున్నది అంటే అక్కుళ్లు, కృష్ణకాటుకలు వగైరా ధాన్యము మార్కెటుకు వచ్చే సమయము వస్తున్నది ఇప్పుడు వున్న ధాన్యాని కేధర నిర్ణయము చేయలేదు ఆరునెలల పంట వచ్చేటప్పటికి గూడ యీ ధర నిర్ణయము జరగకపోతే నిలకడ లేనటువంటి ధరకు ధాన్యమును మార్కెటులో అమ్మవలసిన, కొనవలసిన పరిస్థితి వస్తుంది ధర హెచ్చవచ్చు, తగ్గవచ్చు ధర తగ్గిపోతే రైతుకు రావలసిన ధరరాక నష్టపడుతాడు సవ్యమైన ధరకు ధాన్యము రైతు అమ్ముకోటానికి వీలుండదు గందరగోళ పరిస్థితి ఏర్పడేటట్టు ఉన్నది గతములో రైతులు ధాన్యము మార్కెటుకు రానీయకుండా దాచారు. అని ప్రభుత్వము అపోహపడింది. వాళ్లు నిజముగ ధాన్యమును దాచడములేదు వాగను సప్లయి లేకపోవడమువల్ల యజమానులు, వ్యాపారస్థులు ధాన్యమును కొనలేదు. వాగను సప్లయే లేకపోతే, పైన గిరాకీలేకపోతే, సరుకును కొని ఏమిచేసేది అని ఎవ్వరుకూడ కొనలేదు. అందువల్ల రైతులవద్ద ధాన్యము నిలవ ఉండిపోయింది దాచలేదు అని నేను గట్టిగా చెప్పగలను పైగా ధాన్యముపైన బ్యాంకులనుంచి పైకమును అప్పు తీసుకున్నందున, వాళ్లు అప్పులను కట్టమని ఒక వైపున వత్తిడి చేయడము ప్రారంభించారు. ధాన్యమును విడుదల చేద్దామా

అంటే కొనేవారు లేకపోయారు ఇది నిజమైన పరిస్థితేగాని, రైతులు ధాన్యము దాచారు అన్నమాట నిజముకాదు అంతేకాని వాళ్లు దాచవలెనని దాచలేదు ఇప్పటికీ గూడ ధాన్యమును అమ్ముకోటానికి మార్గము లేకుండ రైతులు చాలా బాధపడుతున్నారు రైలువారికి waggon shortage ఉన్నమాట వాస్తవము అయితే కావచ్చు ఏమైనప్పటికినీ మన ప్రభుత్వమే కేంద్ర ప్రభుత్వాన్ని ఒత్తిడిచేసి ఏ విధముగానైన వ్యాగను సప్లయికి ఏర్పాటు చేయాలని మంత్రిగారిని కోరుతున్నాను వ్యాగను సప్లయి అయితే వ్యాపారస్థులకు వ్యాపారములో గిరాకి ఏర్పడి సరకు కొనటానికి వస్తారు ధాన్యము విడుదల అవుతుంది ధరల స్థిరీకరణకు అవకాశ మేర్పడుతుంది సభ్యులలో చాలామంది ప్రభుత్వము వసూలు చేసే పన్నులమూలంగా వచ్చేడబ్బు చాలామటుకు దుర్వినియోగ మవుతున్నదని చెప్పారు వారితో నేను ఏకీభవిస్తున్నాను ఎందుకంటే, నా అనుభవములో కూడ కొన్ని విషయములు తెలుసును ఈ విషయాలను యితరుల వల్ల వింటున్నాము పత్రికలలోగూడ చదువుతున్నాము కేవలము పన్నులు, పన్నులు అని రైతులమీద వేసి వసూలు చేస్తూ వాళ్ళను మరింత యిబ్బందుల పాలు చేసేబదులు, ప్రభుత్వము చేసే కార్యక్రమములకు గాను చేసే ఖర్చుమీద కొంచెము నిఘాఉంచి ఖర్చులు సక్రమముగాను, దుర్వినియోగము కాకుండా చూస్తే, కొంతవరకు డబ్బును save చేయటానికి వీలు అవుతుంది రైతుల పన్ను భారము, అతని ఖర్చులు, యిబ్బందులను గురించి మేము యీ సభలో ఎన్ని పర్యాయములు ప్రభుత్వ దృష్టికి తెచ్చినప్పటికినీ, వాళ్ళు యిక మీదట ఏమాత్రము భరించలేనిస్థితి ఏర్పడి ఋణగ్రస్థులై ఉన్నను, ప్రభుత్వం యింకను ఏదో విధముగ పన్ను వేయాలనే ఉద్దేశ్యము మంచిదికాదు, న్యాయముకాదు అయినను ఈ సారికి Surcharge Bill తీసుకునిరావడమైంది ప్రతిపాదించడము జరిగింది ఇప్పుడు దీనిని సెలెక్టు కమిటీకి పంపటానికి ఆమోదించమని కోరుతున్నారు కనుక, నేను దీనిని వ్యతిరేకించడము న్యాయముకాదు సెలెక్టు కమిటీలోనైనా కొంచెము సుహృద్భావముతో దీనిని పరిశీలించి రైతుకు ఎక్కువగ భారము లేకుండా ఉండేటట్లు చేయమని కోరుతూ, నేను దీనిని బలపరుస్తున్నాను

శ్రీ యం. బాగారెడ్డి (జహీరాబాదు) : అధ్యక్షా, రెవిన్యూ మంత్రిగారు ప్రవేశపెట్టిన యీ బిల్లును బలపరుస్తూ కొన్ని సూచనలు యివ్వదలచుకున్నాను రెండవ పంచవర్ష ప్రణాళికను అమలులో పెట్టినందువల్ల, నిర్మాణ కార్యక్రమాలను ప్రారంభించినందువల్ల ప్రభుత్వపు ఖర్చులు దినదినం పెరిగిపోతున్నాయి.

శ్రీ యస్ పి చెంగల్రాయనాయుడు Treasury Benches ఖాళీగా వున్నాయి ఎవరికండీ వారు చెబుతున్నది ?

మిస్టర్ ఛైరమన్ ఆర్థికమంత్రిగారున్నారు మీరు చూస్తే కనపడుతుంది

శ్రీ యస్ పి చెంగల్రాయనాయుడు వారెక్కడో కూర్చున్నారు మంత్రులు Treasury Benches లో వుండాలి గాని ఎక్కడనో కూర్చుంటే ఎట్లా ?

శ్రీ యమ్ బాగారెడ్డి అయితే యీ పెరిగిపోయే ఖర్చులను వచ్చే ఆదాయముతో పూర్తి చేయాలంటే అది అసంభవము కనుక అదనపు పన్నులు విధించవలసి వస్తుంది అది ఏ ప్రభుత్వమైనా చేయవలసినపనే అయితే ఎవరి మీద విధించాలనే అంశంకూడా వుంది రైళ్లలోగాని, బస్సులలోగాని, హోటళ్ల లోగాని, బజార్లలో గాని ప్రజలు "నిజాం దగ్గర కోట్లకొలది రూపాయ లున్నాయి, లక్షాధికార్లున్నారు వారిమీద పన్నులు విధించకుండా వ్యవసాయ దారులపైన పన్నులువేసి బాధిస్తున్నారు" అని చెప్పుకుంటున్నారు మన రాష్ట్రంలో చదువుకున్నవారు చాలా తక్కువమంది కనుక ఆ విధంగా అనుకుంటారు నిజాం దగ్గరున్న కోట్ల రూపాయలను తీసుకోవాలని ప్రభుత్వానికి ఉద్దేశం ఉండవచ్చు. కాని అందుకు రాజ్యాంగ చట్టం అడ్డం వస్తుంది. ఉర్దూలో ఒక సామెత వున్నది [illegible] ఆ విధంగా యీ ప్రభుత్వం వ్యవసాయ దారునిపైన, సామాన్య ప్రజలపైన sales tax మొదలగునవి యీ తీరుగా వేయదలచుకుంటున్నది నైజాంపైన, కోటీశ్వరులపైన రాజ్యాంగ చట్టమునకు వ్యతిరేకముగా పోయి పన్నులు వేసే అధికారం యీప్రభుత్వానికి లేదనుకుంటాను. ఈ వ్యవసాయదారులపైన ఏవిధంగా పన్ను వేస్తున్నారు? కాంగ్రెసు తీర్మానించిన Socialistic Pattern of Society ప్రకారం చిన్నవారిపై తక్కువపన్ను వేసి, పెద్దవారిపై ఎక్కువ పన్నులు వేస్తున్న విధానం అందరూ ఆమోదించవలసినదే Currency యొక్క purchasing power తక్కువై law of supply and demand వలననో లేక వేరే కారణాలవల్లనో కొన్ని వస్తువుల ధరలు పెరిగి పోయి కొంత surplus మిగులుతుందని ప్రభుత్వంయొక్క అభిప్రాయముగా కని పిస్తున్నది. Factors of production పోయిన తరువాత surplus value ఏమి వుంటుంది ? Factors of production అంటే wages of labour, interest on capital, profit of management- ఇవన్నీ పెరిగినప్పుడు land revenue కూడా పెరగాలని ప్రభుత్వంయొక్క ఉద్దేశ్యముగా కనబడుతున్నది ఖర్చులన్నీ పోయిన తరువాత వచ్చిన surplus లో మిగతా factors of production యొక్క share విలువ పెరిగినప్పుడు land revenue కూడా అధికం కావాలని ఒక

సిద్ధాంతం వున్నది ఆ సిద్ధాంతాన్ని బట్టి చూస్తే cost of production అన్ని ప్రాంతాలలో ఒకేవిధముగా వుండదు తూర్పుగోదావరి, పశ్చిమ గోదావరి, కృష్ణా, గుంటూరు జిల్లాలలో భూమి సారవంతముగా ఉన్నందువల్ల cost of production తక్కువ కావచ్చు. అందువల్ల surplus value ఎక్కువ కావచ్చు అక్కడ land revenue ఎక్కువచేస్తే అక్కడి వ్యవసాయదారులు భరించవచ్చు కాని కొన్ని స్థలాలలో అటువంటి పరిస్థితులు లేవు ఇంతవరకు భూమి మీద నున్న పన్నే అధికంగా వుంటూంది దానిపైన surcharge వేసి పెంచినట్లయితే ప్రజలకు కష్టతరంగా వుంటుందని మనవిచేస్తున్నాను ఇప్పుడు నైజాం రాజ్యం లోపల జాగీరులు, sarf-e-khas ప్రాంతాలలో యింకా చాలవరకు survey కాలేదు వాటి రెవిన్యూ యింకా స్థిరంగా ఏర్పాటుచేయలేదు నవాబుగారు ఎకరానికి 5 రూపాయ లిమ్మంటే ప్రజలు ఆవిధంగా యిచ్చేవారు ఆ కాలంలో ఎదురులెకుండా రెవిన్యూ వసూలుచేయబడేది ఒకసారి యిచ్చిన శిస్తు వాపసు తీసుకుంటే గౌరవానికి భంగమనుకునేవారు కాని నేడు ప్రజారాజ్యంవచ్చింది ప్రజాప్రతినిధులము వచ్చాము కావున నవాబులతీరుగా కాకుండా శిస్తుతక్కువ చేయాలనికోరుతున్నాను శ్రీబూర్గుల రామకృష్ణారావుగారు ముఖ్యమంత్రిగా వున్నప్పుడు యిటువంటివి ఎన్నో వారిదృష్టికి తెచ్చినప్పుడు రూ.కి నాలుగణాల చొప్పున వెంటనే తగ్గించారు తక్కువచేసినాకూడా ఖాల్సా భూములకు జాగీరు పాయిగా భూములకు ప్రక్కప్రక్కనే ఒక దగ్గరనే వున్న భూములను పోల్చి చూసినట్లయితే జాగీరు పాయిగా భూములకు ఎకరానికి 6 రూపాయలు శిస్తుంటే ఖాల్సా భూములకు రెండు రూపాయలున్నాయి అయితే మనం యేమి చేస్తున్నాం? 6 రూపాయలకు కూడా 0-4-0 ఎక్కువ చేస్తున్నాం 0-8-0 ఎక్కువ చేస్తున్నాం 0-2-0 ఎక్కువ చేస్తున్నాం రెండు రూపాయ లున్నదానికి కూడా ఎక్కువ చేస్తున్నాం అంటే మనం గొర్లలెక్క తీరుగా ప్రవర్తిస్తున్నామన్నమాట మనం తెలిసినవాళ్ళం లెక్కలున్నాయి. ఎక్కడ ఎక్కువవుందో ఎక్కడ తక్కువవుందో ఆలోచించి ఒక నిర్ణయానికి రావాలి. ఆంధ్రప్రదేశ్ లోపల ఏ జిల్లా అయినా సరే - అది మెదక్ అయినా తూర్పు గోదావరయినా, అక్కడున్న అవకాశాలనుబట్టి సారవంతాన్నిపట్టి పన్ను విధించవలని వుంటుంది నిన్నటి చర్చలో ఒక విషయం స్పష్టమయింది. వ్యవసాయదారులు అధికంగా ఉత్పత్తి చేసినా అటు వ్యవసాయదారునకుగాని, యిటు ప్రభుత్వానికిగాని లాభంకలుగకుండా middleman కు ఎక్కువలాభం కలుగుతున్నది ధరలలో fluctuations వున్నవి బియ్యము ధరలవిషయంలోనే కాక సంవత్సరాని కొకేసారి పండే చెరకు, జొన్నలు మున్నగు వస్తువుల ధరల హెచ్చుతగ్గులు గత 10 సంవత్సరాలుగా పరిశీలిస్తే వ్యవసాయదారుడు

ఎండించి పంట అమ్మేటప్పుడు ధర తక్కువై తరువాత store చేసుకుని అమ్ముకునే పెద్దవ్యాపారస్థులు అమ్మేసమయంలో ధరలు ఎక్కువగా పెరుగుతాయి దీనిని అరికట్టకపోతే వ్యవసాయదారునికీ, ప్రభుత్వానికీ నష్టంవస్తుంది దానికి ప్రభుత్వం కృషిచేసినట్లు తెలిసినది. Agricultural Marketing Society లు పెట్టినారు వాళ్ళకు అధికారం యిచ్చినారు వ్యవసాయదారుడు తెచ్చిన ధాన్యంపై నూటికి 70 వంతో 60 వంతో డబ్బు అతనికి యివ్వవచ్చు ఆ విధంగా రైతుకి అత్యధికంగా సహాయం చేయాలని నామనవి జహీరాబాదు తాలూకా గురించి కొన్ని సంగతులు చెప్పదలచుకున్నాను ఎందుకంటె, గడచిన ఆరునెలలలో మాట్లాడేఅవకాశం తొందరగా దొరకలేదు కనుక, మంత్రులు వున్నా లేకున్నా ఏ speech లో నైనా అన్నిసంగతులు చెప్పవలసి వస్తున్నది

గడచిన రెండు సంవత్సరాలలో అధికవర్షాలవల్ల మా తాలూకాలో పంటలు నష్టపడినవి జహీరాబాద్, నారాయణఖేడ్ తాలూకాలలో గత 30, 40 సంవత్సరములలో rainfall ను average గా చూచినట్లయితే 30 అంగుళములకు మించిలేదు. కాని 1955-56 లో 50 అంగుళములకు మించి వర్షము కురియటంవల్ల అక్కడ పంటలకు నష్టం కల్గింది మా ప్రక్కనవున్న కర్ణాటక ప్రాంతములోని మైసూరుజిల్లాలో అధికవర్షాలవల్ల పంటలు పాడైతే ఆ ప్రభుత్వం రెండు సంవత్సరములనుంచి land revenue ని వసూలుచేయటం ఆపివేసింది ఆ విషయమును మన ప్రభుత్వమునకు ఎన్నోసార్లు మేము చెప్పాము ఎందువల్లనోగాని అటువంటి పని మన ప్రభుత్వం చేయటములేదు 1953-54 సంవత్సరములలో మా జహీరాబాద్ మార్కెటుకు ఒక కోటి రూపాయల food grains, commercial crops వచ్చేవి ఈ రెండు సంవత్సరాలనుండి పంటలు దెబ్బతిన్నందువల్ల 36 లక్షల రూపాయల సరుకుమాత్రమే వస్తున్నది పంటలు నష్టపడి, ప్రజలు బాధపడుతున్నప్పుడు వారికి సహాయపడవలసిన కర్తవ్యం మన ప్రభుత్వమునకు వుందని నేను మనవిచేస్తున్నాను

శ్రీ కె. రామచంద్రారెడ్డి (రామన్నపేట) . అధ్యక్షా ! రైతులపై ఇంకా అదనంగా పన్నులభారము మోపటానికి మంత్రిగారు ఈ బిల్లు ప్రవేశపెట్టారు direct taxes, indirect taxes అని రెండువిధాలుగా రైతులనుండి ఎన్నో పన్నులు వసూలు చేయబడుతున్నాయి దేశాభివృద్ధికి ప్రజానీకాభివృద్ధికి అదనపుపన్నులు వేయవలసి వస్తున్నదని మంత్రిగారు చెప్పారు. అభివృద్ధి కావాలనే అందరము కోరుతున్నాము. ఇంతకుముందు బిల్లును ప్రవేశ పెడుతూ, మంత్రిగారు మేము progressive పద్ధతిమీద ప్రవేశపెడతాము, gradation

పద్ధతిమీద పెడుతున్నామని అందుచేత అందరు హృదయపూర్వకంగా దీనిని అంగీకరించాలని కోరారు ఇంతవరకు తెలంగాణాలో అభివృద్ధిగా వున్న **agricultural income tax** ను రద్దుచేస్తూ రాష్ట్రాన్ని అభివృద్ధిలోనికి తీసుకు పోతామని చెప్పటంలో నాకు ఏమి అర్థం కన్పించటంలేదు పైవర్గంవారినుండి పన్ను వసూలు కావటంలేదు, కాబట్టి మినహాయిస్తున్నామని చెప్పారు బుద్ధిపూర్వకంగా పైవర్గాలను దీనినుండి మినహాయించటానికె ఇలా ఈ ప్రభుత్వం చేసిందని చెప్పకతప్పదు వ్యవసాయ ఆదాయముపై సంపదపై, కేంద్రమే పన్ను వేస్తున్నది ఇతరరాష్ట్రాలవారు కూడా కేంద్రాన్ని అనుసరిస్తున్నారు కాని మన ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం వ్యవసాయ ఆదాయపు పన్నును రద్దుచేసి, ఒక కుంట, ఒక సెంటు భూమిగల రైతులపై పన్ను వేసేపద్ధతి **progressive** పద్ధతి అని చెప్పటం ఆశ్చర్యముగా వున్నది సామ్యవాద తరహా సమాజమును నిర్మించటము మా ఆశయమని ఒకవైపు చెప్తూ, రెండోవైపు సామ్యవాదతరహా సమాజములో చేయవలసిన పనులను ఈ ప్రభుత్వం చేయటం లేదని నేను అనుకొంటున్నాను ఇప్పటికే రైతాంగముమీద పన్నులభారం ఎక్కువ అయినది **N E S** బ్లాకులకు $\frac{1}{3}$, $\frac{1}{4}$ వంతు డబ్బు రైతాంగము భరిస్తున్నారు కమ్యూనిటీ ప్రాజెక్టులకు చెల్లిస్తున్నారు ఇతర అభివృద్ధి ప్రణాళికలకు గ్రామాలలో పాఠశాలలు కట్టాలన్నా, కాలువలు త్రవ్వాలన్నా, చెరువులు త్రవ్వాలన్నా రైతాంగము $\frac{1}{3}$, $\frac{1}{4}$ **contribute** చేస్తున్నారు పండిన ధాన్యమును మార్కెటుకు తీసుకువెళ్ళిన పిదపఅక్కడ అమ్మకపు పన్ను కూడా ఈ రైతులు చెల్లిస్తున్నారు రైతులు తమకు అవసరమైన వస్తువులు కొనుక్కొనేటప్పుడు కూడా **indirect** గా పన్నులను చెల్లిస్తున్నారు **Wet Assessment, dry land** మీద సర్ ఛార్జి, **commercial crops** మీద పన్ను ఈ విధంగా మూడు పేర్లుపెట్టి, మూడు విధాలైన పన్నులను రైతులపై ఈ ప్రభుత్వం వేస్తున్నది ఈ రకాలైన పన్నులను భరించేశక్తి ఎవరికి వున్నది? ఎవరికి లేదని ఈ ప్రభుత్వము ఆలోచించటము లేదు విశాలాంధ్ర ఏర్పడకముందు ప్రజలలో "విశాలాంధ్ర ఏర్పడితే హైదరాబాద్ రాష్ట్రములో వున్న రైతాంగము పన్నులు తగ్గుతాయని నీటిమీద పన్ను తక్కువ అవుతుందనే" అభిప్రాయము వుండేది పార్టీవిచక్షణ లేకుండా, అన్ని పార్టీలవారు ఈ ప్రకారముగానే ప్రచారము చేశారు కాని కొంతమంది వ్యక్తులు దానికి విరుద్ధంగా 'విశాలాంధ్ర ఏర్పడితే మన తెలంగాణాలో పన్నులభారం ఎక్కువ అవుతుందని' చెప్పారు ఈ నాడు పన్నులువేసే విధానము చూస్తూవుంటే వారు చెప్పింది నిజమేననే అభిప్రాయం తెలంగాణా ప్రజలలో కలిగేటట్టు ఈ ప్రభుత్వం చేస్తున్నది నైజాం తన పరిపాలనా కాలంలో పల్లెటూళ్ళను వల్లకాడుగా మార్చి పట్టణాన్ని

శృంగారించాడు తెలంగాణా ప్రాంతములో మాగాణి భూములపై పన్నులు విపరీతంగా వున్నాయి మెదక్ జిల్లాలో 22-0-0 వుంది రు 16-0-0 కంటే తక్కువలేదు హైదరాబాదు జిల్లాలో 12-0-0 కంటే తక్కువలేదు నిజామాబాద్ జిల్లాలో 14-0-0 రు ల కంటె తక్కువలేదు మహబూబ్‌నగర్‌లో 22-0-0 నుండి 12-0-0 వరకు వుంది వరంగల్లుజిల్లాలో 18-0-0 వుంది 10-0-0 కంటె తక్కువలేదు కరీంనగర్ జిల్లాలో 10-0-0 కంటె తక్కువలేదు నల్గొండజిల్లాలో 21-0-0 నుండి 10-0-0 వరకు వుంది అదిలాబాద్‌లో 8-0-0 తక్కువలేదు ఖమ్మంజిల్లాలో 10-0-0 కంటె తక్కువలేదు కుష్కి మీద చూచినట్లయితే ప్రతి జిల్లాలోను 3-4-0, 3-5-0 నుండి వుంది 1-8-0 కంటె తక్కువ ఎక్కడా లేదు **Dry land** మీదకాని లేక మాగాణి భూమి మీద కాని ఈనాడు విపరీతమైన పన్నులు వున్నాయి

శ్రీ టి. వి. రాఘవులు (కొవ్వూరు - రిజర్వుడు), **Wet rates** గురించి సభ్యులు చెబుతున్నారనుకొంటాను అది దీనికి వర్తిస్తుందా ?

శ్రీ కె. రామచంద్రారెడ్డి తెలంగాణాలో తక్కువచేసే ఉద్దేశ్యం ఈ బిల్లులో వున్నట్లు కనిపించటములేదు ఏ రైతులు ఈ పన్నులభారాన్ని భరించ గలరో ఏ రైతులు ఈ పన్నులభారాన్ని భరించలేరో గౌరవ సభ్యులు చాలా మంది చెప్పారు నైజాం ప్రభుత్వానికి వ్యతిరేకముగా ఆంధ్రమహాసభలో కొండా వెంకటరంగారెడ్డిగారు ఈ పన్ను రు 8-0-0 మించకూడదని తీర్మా నించారు ఖుష్కి భూములకు మూడోవంతు తగ్గించాలని తీర్మానము చేశారు ఈనాడు క్యాబినెట్‌లో హైదరాబాద్ మంత్రులుకూడా వున్నారు

తెలంగాణాలోని భూముల సంగతి తీసుకుంటే అవి చాలా సారహీన మైన భూములు. వాటికి నీటి **guarantee** అనే విషయం లేనేలేదు ప్రకృతిమీద ఆధారపడిన వ్యవసాయం జరుగుతున్నది తప్ప నీటి గ్యారంటీకి ప్రాజెక్టులు ఏమీలేవు. ఇక్కడ **dry land** మీద **surcharge** వేయడం, **commercial crops** మీద వేయడం తగని విషయం. తెలంగాణా పరిస్థితిని అర్థం చేసుకొనడానికి కొన్ని **figures** సభముందు పెట్టదలచుకున్నాను. ఆంధ్ర ప్రాంతంలోనే ఈ **surcharge** వేయాలని నా ఉద్దేశంకాదు ఆంధ్రకు తెలంగాణాకు ఉన్న భేదం ఎట్లా ఉన్నదీ తెలుసుకోవాలి అక్కడ ప్రజలు ఏ విధంగా చెల్లిస్తున్నారు. ఇక్కడి ప్రజలు ఏ విధంగా చెల్లిస్తున్నారు అనే విషయమై కొన్ని **figures** ప్రభుత్వం ముందు పెట్టదలచాను. **Per capita incidence of indirect taxes** తెలంగాణాలో 8 20 ఆంధ్రలో అది 4 17. తరువాత **total revenue**

national income లో ఇక్కడ 7 18%, ఆంధ్రలో 4% అదేవిధంగా tax revenue of national income లో 5 35 ఆంధ్రలో 2 94 ఆ ప్రకారం యిక్కడ రెవిన్యూ చూస్తే 3 కోట్ల 30 లక్షల రూపాయలు ఆంధ్రలో 3 కోట్ల 35 లక్షలు Land revenue per capita తెలంగాణాలో 2 92. ఆంధ్రలో 1 63 Land revenue for wet cultivated area 2 7 యిక్కడ 3 21 ఆంధ్రలో Land revenue per head on agricultural co - operation 4.71 తెలంగాణాలో, ఆంధ్రలో 2 31 ఈ లెక్కలనుబట్టి చూసినట్లయితే తెలంగాణా రైతాంగంమీద ఎంత tax ఉన్నదో చక్కగా బోధపడుతుంది దీని ప్రకారం ఆంధ్రలో పెంచాలని నా ఉద్దేశంకాదు ఈ సభవారు అర్థం చేసుకోడానికీ, అక్కడికీ ఇక్కడికీ వున్న భేదాన్ని గుర్తించడానికి ఈ లెక్కలు చెప్పాను ఈనాడు ప్రజలు ముందుకు పోవాలంటే, మనదేశం అభివృద్ధి కావాలంటే యిక్కడైనా, అక్కడైనాగాని పన్నులు వేయాలి ప్రభుత్వం ఈ రోజుల్లో progressive system అవలంబిస్తామని చెబుతున్నారు కాబట్టి తెలంగాణాలో కుటుంబ గరిష్ట పరిమితి, కౌలుదారీచట్టం ఉన్నాయి కాబట్టి కనీసం దాంట్లో family holdings మినహాయించి, మిగిలినదానిపైన Surcharge వేయవచ్చు 'అదేవిధంగా ఆంధ్రలో కూడా 50 రూ ల శిస్తు మినహాయించి అంతకంటె ఎక్కువవున్నవారికి surcharge వేయండి ఆర్థిక మంత్రిగారు ఈ 10 రూ. ల లోపువారికి శిస్తు తగ్గింపు ఉంటుందో లేదో Select Committee కి వెళ్లివచ్చిన తరువాత గాని చెప్పలేమన్నారు అందువల్ల 10 రూ లు మినహాయించే పరిస్థితికూడా లేనట్లుగా అర్థంచేసుకోవలసివస్తోంది 10 రూ, లు కాకుండా ఇక్కడ కుటుంబానికి 50 రూ. లు పెట్టి అంతకు పైన వున్న వారిపై gradation system పెట్టినట్లయితే ఎక్కువ డబ్బు వస్తుంది ఆవిధంగా మనం ముందుకుపోయే అవకాశంఉంటుంది తెలంగాణాప్రాంతంలో పన్ను లేనటువంటి మాగాణిప్రాంతం ఎక్కువగా బోధన్ ఫ్యాక్టరివారి క్రిందనే ఉన్నది. వారి మీద wet assessment పడదు వారిపై agricultural income tax లేదు

పై వర్గాలను కాపాడే దృష్టితో ఈవిధంగా తీసుకురావడం జరిగింది అందువల్ల వ్యవసాయాదాయపు పన్ను చట్టాన్ని వెంటనే ఆంధ్రప్రదేశ్ కంతకూ వ్యాపింపచేస్తూ ఎక్కువ డబ్బును వసూలుచేసేపద్ధతి అవలంబిస్తారనుకున్నాము, కాని "మాకు చేతకాదు, చేయలేము అని నిస్సహాయస్థితిలో ఉంటుందనుకోలేదు ఈ ఆంధ్రప్రదేశ్ గవర్నమెంటు అసమర్థతను వెలిబుచ్చకుండా, చాలా శక్తివంతంగా, సమర్థతతో అభివృద్ధి కార్యాలకు పన్నులు వసూలుచేస్తూ ముందుకు పోవాలని కోరుతూ నేను ముగించుచున్నాను.

శ్రీ టి రామచంద్రారెడ్డి (పుట్లూరు) అధ్యక్షా మహాశయా, రెవిన్యూ మంత్రిగారు ప్రవేశపెట్టిన ఈ **Surcharge Bill** ను నేను హృదయపూర్వకంగా బలపరుస్తూ, కొన్ని సూచనలను ప్రభుత్వ దృష్టికి తీసుకొనివస్తున్నాను లోటు బడ్జట్‌ను సవరించుకోవాలనే అభిప్రాయం ప్రభుత్వానికి కలిగినప్పుడల్లా– వారి యొక్క దృక్పథం మాత్రం ప్రతి సంవత్సరం కూడా రైతాంగం మీదనే పడుతున్నది గతసంవత్సరం కర్నూలులోవుండగా **surcharge, water cess, betterment tax**– ఈ విధమైన అనేకబిల్లులు తెచ్చి రైతాంగంమీదనే రుద్దిన విషయం యీనాటికీ మనం మరచిపోకూడదు ఈ సంవత్సరంలో 5 కోట్ల 48 లక్షల రూ॥ల లోటుఉన్నది అందువల్ల మరల ఆ బిల్లులనే ఈ స్వరూపంగా యిప్పుడు ప్రవేశపెడుతున్నారు ఈవిధంగా ప్రభుత్వందృష్టిని అస్తమానం అమాయకులైన రైతాంగం మీదికి ప్రసరింపచేస్తూంటే ప్రభుత్వానికి కూడా గడ్డుదినాలు రాక తప్పదు

మన రాష్ట్రంలో ప్రభుత్వం అభివృద్ధి కార్యక్రమాలను జరిపించుతున్న మాట వాస్తవమే వాటికి కొంతడబ్బు కావాలనేవిషయం నేనుకూడా అంగీకరిస్తున్నాను ఈ డబ్బు సంపాదించడానికి ప్రభుత్వానికి వేరేమార్గాలులేవా? పదేపదే రైతాంగంమీదనే పన్నులు వేస్తుంటే, అతను ఎంతవరకూ భరించగలడో ప్రభుత్వంకూడా కొంచెం ఆలోచించాలి ఇందులోని గౌ సభ్యులు చాలమంది రైతుకుటుంబాలకు చెందినవారే అందరూ ఒకసారి అంతరాత్మను పరిశీలించుకోవాలి రైతులకు ఈనాడు ఎంత గిట్టుబాటు ధర వస్తున్నదో ఆలోచించాలి రైతు కష్టపడి పండించిన ధాన్యానికి సరైనధరలుంటే కొంతవరకూ గిట్టుబాటు అవుతుంది ధాన్యానికి గాని, యితర వ్యాపార పంటలకుగాని ఒకస్థిరమైన ధరలు లేకపోవడం రైతులయొక్క దురదృష్టం రైతులమీద యిన్నిపన్నులు వేస్తున్నప్పుడు, వారి సదుపాయాలనుకూడా చూడాలి ఉదాహరణకు గత 2½ సం॥లనుంచీ రైతులకు బండిపట్టాలు యిస్తున్నారేమో అడగండి ఏ జిల్లాలోనూ రైతులకు బండిబట్టాలు యివ్వలేదు. కాని, రైతులను దబాయించి పన్నులు వేయడానికి మాత్రం వెనుకాడడంలేదు మనం ఏవిధంగా రైతులనుంచి పన్నులు వసూలు చేస్తున్నామో, అదేవిధంగా సుహృద్భావంతో వారికి కావలసిన సదుపాయాలు చేయాలి మెన్యూర్స్ **Iron materials....** . యిటువంటివి ఇచ్చుటలో ప్రభుత్వంవారు తోడ్పడకపోతే రైతులకు చాలా కష్టంగా ఉంటుంది

రాయలసీమ ప్రాంతంలో ఊటకాలువలున్నాయి వాటిని అక్కడి ప్రజలు స్వంతకష్టంమీద ఉదయం 4 గంటలనుంచి రాత్రి 9 గంటలవరకూ,

ఎకరానికి ఒక మనిషి వంతున కలిసి శ్రమ చేస్తే—వారిదగ్గరనుంచి ఎకరానికి రూ 10-8-0 వరకూ వసూలు చేస్తున్నారు ఇంత అన్యాయం ఎక్కడైనా ఉంటుందా ? జిల్లావారీగా, ఏ జిల్లాలో ఎంత శిస్తు ఉన్నది అనేవిషయం 4 రోజుల క్రితమే కళా వెంకట్రావుగారు చెప్పారు నెల్లూరు జిల్లాలో రు 5,- ఉండడమేమి, రాయలసీమ, అనంతపురం జిల్లాలలో 10-8-0 ఉండడమేమి ? ఇంత తారతమ్యం ఎందుకుండాలి ? ఒకవేళ ప్రభుత్వానికి డబ్బుకావాలంటే— re-settlement చేయండి ప్రభుత్వం ఏర్పాటుచేసిన నీటివసతులున్న ప్రాంతాలలో equal గా వేయండి అంతేగాని, రాయలసీమలోవున్న ఊటకాల్వలపైన, ప్రభుత్వం ఏర్పాటుచేసిన నీటివసతులున్న ప్రాంతాలతో సమానంగా శిస్తు వేయడం చాలా అన్యాయం ఇది దృష్టిలో పెట్టుకొని యుక్తాయుక్తాలతో ప్రవర్తిస్తే చాలా బాగుంటుందని ప్రభుత్వ దృష్టికి తెస్తున్నాను ఏ ప్రాంతంలో ఎంతపంట పండిస్తున్నారనేది చూడాలి ఈనాడు ప్రభుత్వం ఏర్పరచిన నీటిసదుపాయాలున్న ప్రాంతాలలో ఎకరానికి 30 బస్తాలుకూడా పండిస్తున్నారనే విషయం జ్ఞాపకం పెట్టుకోవాలి రాయలసీమలోని రైతు ప్రభుత్వం ఏమాత్రమూ ఖర్చుపెట్టకుండానే తన స్వయంకృషితో నీటిసదుపాయాలను ఏర్పాటుచేసికొని పంటపండిస్తూంటే—ఎకరానికి 10 రు ల ప్రకారం మన శిస్తులు వసూలుచేయడం ఎంత న్యాయంగా ఉంటుందో ఆలోచిస్తే మాత్రం చాలా బాగుంటుంది ఈ విధంగా రైతులమీదనే ఎక్కువగా శిస్తులు వేస్తే వారు చాలా కష్టాలకు లోనుకావలసి వుంటుందని మనవి చేస్తున్నాను రైతు ఎంత సుహృద్భావం గలవాడో మనం గ్రహించాలి మనం యిన్నిపన్నులు వేస్తున్నాకూడా రైతు నోరెత్తి 'నేను strike చేస్తా'నని ప్రభుత్వాన్ని బెదరిస్తున్నాడా ? ఇటీవల కృష్ణాజిల్లాలో nationalisation of bus routes గురించి ఎంతో ఆందోళన చేశారు గ్రామోద్యోగులంతా సమ్మె చేస్తున్నామని, కొంతవరకూ సమ్మె చేశారు ఈ విధంగా రైతాంగం ఎందుకు చేయలేకపోతున్నది ? అంటే వారికి ప్రభుత్వంమీద కొంతవరకూ సుహృద్భావం వున్నది. ఆ సుహృద్భావాన్ని ప్రభుత్వంవారు గుర్తించి, వారిని కొంచెం ఉదారంగా చూడాలని కోరుతున్నాను

ఒక గౌరవ సభ్యుడు ఎవరిమీద strike చేయమనీ అదికూడా వారే చెప్తే బాగుంటుందని నా మనవి

శ్రీ టి. రామచంద్రారెడ్డి ఈ దినం యావద్భారతదేశం రైతాంగం మీదనే ఆధారపడి ఉంది ఈ దినం ఆంధ్రప్రదేశంలో ఉన్నటువంటి 3 కోట్ల ప్రజానీకమునకు అన్నపానాదులు దొరుకుతున్నాయంటే వాస్తవంగా రైతు యొక్క స్వయంకృషివల్లనే అది జరుగుతున్నది. రైతుకష్టం ఫలితంగానే

మనం ఈనాడు జీవిస్తున్నామనేది అందరు జ్ఞాపకం పెట్టుకోవాలి ఈ అవకాశం ఇచ్చినందులకు అధ్యక్షులవారికి నాఅభినందనలు

శ్రీ ఎ వెంకటరామరాజు (రాజోలు - జనరల్) రామచంద్రారెడ్డిగారు ఈ బిల్లును support చేస్తున్నారా ? వ్యతిరేకిస్తున్నారాండి

*Sri T Ramachandra Reddi* I am supporting the Bill Sir I want at the same time the Government to give some facilities to the agriculturists నేను హృదయపూర్వకంగా ఈ బిల్లును సమర్థిస్తున్నాను

*శ్రీ బి శంకరయ్య (బుచ్చిరెడ్డిపాలెం - జనరల్) అధ్యక్షా, ఈ సమావేశంలో పన్నులు వేసేటటువంటి బిల్లులు, పన్నులు తీసేటటువంటి బిల్లులు అన్నీ కలిపి ఆలోచించేటట్లయితే, (పన్నును తీసే సె క్లాజుకూడా ఉందిలెండి) ప్రభుత్వం ఈ భూస్వాములమీద మాత్రం, అధిక ఆదాయం వచ్చేవాళ్ళమీద మాత్రం పన్నులు పడకుండా పేదవాళ్ళమీద పన్నులు వేసేదానికి సిద్ధపడుతోందని మనకు స్పష్టంగా తెలుస్తోంది ఇపుడు ప్రజలమీద వున్న పన్నులు జాస్తీ అని చెప్పి, వాటిని తగ్గించాలని, ఇపుడు ఎవరైతే మంత్రులుగా ఉన్నారో, ఎవరైతే ప్రభుత్వ పార్టీలో ఉన్నారో, వాళ్ళంతాకూడా ఇదివరకు చెప్పినటువంటి వాళ్ళే ఆవిధంగా 1931 నుంచీకూడా కాంగ్రెస్‌లో తీర్మానాలు చేశారు. ఇపుడు ఈ పది సంవత్సరాలలో కాంగ్రెస్ అధికారంలోనికి వచ్చినతరువాత సామాన్య ప్రజలమీద ఎక్కువ పన్నులు వేశారు వాటిని తగ్గించుదామని ఆలోచనచేయడం లేదు గత 2 సంవత్సరాలుగా విపరీతంగా పన్నులుకూడా హెచ్చు చేస్తున్నారు సామాన్య ప్రజల ఆదాయం పెరిగిందా లేదా ? అని చూడడం లేదు మన దేశంలో తక్కినటువంటి చోట్లకన్నాకూడా మన రాష్ట్రంలో ఇపుడు భూముల పన్నులు జాస్తీగా ఉన్నాయనేది మన ప్రభుత్వం చూడడంలేదు. ఇపుడు సామాన్య ప్రజలలో వారికి వచ్చేటువంటి ఆదాయం వారి కుటుంబానికే చాలడం లేదని చూడడం లేదు దేశంలో అంతా పెద్ద ఆందోళన వచ్చింది భారతప్రభుత్వం కూడా ఈ విషయం ఆలోచిస్తున్నది ఎపుడో కాంగ్రెస్ చేసిన తీర్మానాలే కాకుండా ఈ పన్నులు ఎట్లా వేయాలని చెప్పి, అపుడు, మన రెవిన్యూలో, Budget లో లోటును పూడ్చుకోడానికిగాను ఈ విషయంలో ఆలోచించడానికి దేశంలో అంతా విచారించడానికి ఒక committee ని కేంద్రప్రభుత్వంవారు వేశారు. ఈ విధంగా విచారించిన తరువాత వాళ్ళు చేసినటువంటి శిఫార్సులు కొన్ని కేంద్రప్రభుత్వంవారు కూడా ఆమోదించారు. అందులో ఇపుడు మన రాష్ట్రానికి సంబంధించినంతవరకు వ్యవసాయ సంపదలమీద పన్ను వేయటానికి

అవకాశం ఇచ్చినారు ఆ విధంగా ఇతరసంపదలమీద కేంద్రప్రభుత్వం పన్నులు వేసినప్పటికి ఈ వ్యవసాయం విషయంకూడా రాష్ట్రప్రభుత్వాలకు సంబంధించినటువంటి విషయం కనుక రాష్ట్రప్రభుత్వాలు మాత్రం ఈ పన్నులు వేయవలసియున్నది వ్యవసాయ సంపదలమీద ప్రభుత్వం పన్నులు వేయడానికి ఆలోచించడంలేదు సరికదా ! ఇపుడు వ్యవసాయ ఆదాయంమీద పన్నులులేవు చాలా రాష్ట్రాల్లో వ్యవసాయ ఆదాయంమీద పన్నులు వేస్తారు ఈ వ్యవసాయ ఆదాయపుపన్ను విధించే ప్రాంతాలు మనరాష్ట్రంలో ఉన్నవి ఆవిధంగా పన్నులు వేసేపద్ధతిని ఈ రాష్ట్రంలో మేము రద్దుచేస్తున్నామని కూడా చెప్తున్నారు అందువల్ల వ్యవసాయంమీద ఎవరైతే ఆదాయం సంపాదిస్తున్నారో, డబ్బు బాగా గడిస్తున్నారో అటువంటివాళ్ళమీద పన్నులు వేయడానికి ప్రభుత్వం పూనుకోవడంలేదు 2 సంవత్సరాలనుండి ప్రభుత్వం వ్యవసాయ ఆదాయాలపై ఈ graded tax ఒప్పుకోమని చెప్పేవాళ్ళు ఎక్కువ ఆదాయం వచ్చేవాళ్ళమీద పన్నులు వేయాలని కేంద్రప్రభుత్వ సూచనలైతేనేమి, దేశంలో వచ్చినటువంటి ఆందోళన వల్లనైతేనేమి, వాళ్ళ పార్టీలోకూడా అనేకమంది వత్తిడివల్లనైతేనేమి ఇపుడు graded tax ఒప్పుకుంటామని చెప్తున్నారు. దానిని ఒప్పిస్తున్నప్పుడు సామాన్యప్రజలమీద అదనపుపన్నులు లేకుండా భూస్వాములకు వచ్చే ఆదాయంమీద తగినంత పన్ను వేయడానికి మాత్రం ప్రభుత్వం పూనుకోవడంలేదు Graded tax లో ఉన్న అభివృద్ధికరమైన భావం ప్రకారం భూస్వాముల మీద ఎక్కువ కాకుండా లేకుండా, దానిని ఎగురగొట్టేసి, మరొక రూపంలో, మరొక వేషంలో ప్రభుత్వందీనిని సామాన్యమైనటువంటి ప్రజల మీదనే వేయడానికి ఈ బిల్లును తీసుకువచ్చింది ఇదివరకే గత రెండుసంవత్సరాలుగా ఈవిధంగా భూమిశిస్తులవల్ల వచ్చేఆదాయం నూటికి 50 వంతులు పెరిగిందని మన ఆర్థికమంత్రిగారు చెప్పారు నూటికి 50 వంతులు భూమిశిస్తు పెరిగినది ప్రభుత్వం యిచ్చిన లెక్కల ప్రకారం మొత్తం దేశంలో ఉన్నటువంటి పన్నులను కాని చూసినట్లయితే సగటున ఇపుడు వ్యవసాయదారులమీద భారతదేశంలో ప్రతిమనిషికి2 84 పన్ను ఉంటే, మన ఆంధ్రలో 3 24 ఉంది,ఆంధ్రప్రదేశ్ లో 3 71 ఉన్నది, భారతదేశంలో మొత్తంమీద ప్రతి ఎకరానికున్న మొత్తం ఆంధ్రదేశంలో వున్న పంట భూమి పన్ను ఎక్కువగా నున్నది మన భారతదేశం మొత్తం మీద సగటున మనము ఎక్కువ భూమి పన్ను విధించితున్నాము. భారతదేశం మొత్తంపైన సగటున ఎకరానికి 2 33 ఉంటే ఆంధ్రప్రదేశ్ లో 2 9 వుంది, ఆంధ్రలో 2.83 ఉంది ఈవిధంగా మన భారతదేశంలో అన్నిచోట్లకన్నా కూడా ఇప్పుడు మనం భూమి పన్నులు ఎక్కువ చెల్లిస్తున్నాము నూటికి 50 వంతులు హెచ్చించామని చెప్పారు ఈ హెచ్చించినవాటిని కూడ లెక్కలోకి

తీసుకుని భారతదేశ సగటు లెక్కలు కట్టారో లేదో మనకు తెలీదు ఇంతేకాకుండా ఆహారధాన్యాలమీద వేసే Sales-tax కూడా సాధారణమైనటువంటి రైతాంగం మీద పరోక్షంగా పడేటటువంటిదే అందువల్ల ఈ విధంగా రైతుల మీద ప్రతి సంవత్సరం, ప్రతి సమావేశంలోకూడా ఏమేమి పన్నులు వేద్దామా అనేదానినే ఆలోచిస్తున్నారు నిజంగా మన లోటు budget ను పూడ్చుకోవాలనేటట్లయితే మన ఆదాయం ఎక్కువగా రావాలనేటట్లయితే వ్యవసాయ ఆదాయం మీద పన్నును రద్దుచేయడానికి ఎందుకు పూనుకున్నారు ? వ్యవసాయాదాయం మీద పన్ను వేసి సరిగా వసూలు అయేటట్లుగా చూడాలి అసలు ఈ ఆదాయపుపన్ను ఏ 3 వేలు వచ్చేవాళ్ళమీదనే కాక వెయ్యి రూ లకు పైన వచ్చేవాళ్ళ మీద వేస్తే యింకా ఎక్కువ వస్తుంది భూసంస్కరణలు వస్తే ఏమి వస్తుంది ? అని గత పర్యాయం ప్రభుత్వంతరపున చెప్పాను భూసంస్కరణలు వచ్చినపుడు చూస్తాం భూసంస్కరణలు వచ్చినపుడు 3 వేల 6నూర్లకో, 4 వేల 8నూర్లకో ఆ విధంగా planning commission సూచించినట్లుగా ఎంతమట్టుకు చేస్తారో, ఎపుడు చేస్తారో ఆ విషయంఅటుంచండి 3వేలు, కనీసం ఒక వేయి రూపాయలు అయినాకూడా ఈ లోపల మినహాయించి ఆపైన పన్ను వేసేటట్లయితే అధిక ఆదాయం వచ్చేది అంతేకాదు ఇపుడు వేసినటువంటి ఈ graded tax కూడా ఒక కుటుంబం మీద వేసేటటువంటి పద్ధతికూడా తీసుకురావడంలేదు ఈ Ordinance వచ్చిన తర్వాత చాలామంది. మన మంత్రులతోసహా మైనర్ పిల్లలపేర, భార్యపేర, 20, 21, 22 ఎకరాలు రాసేశారు అందువల్ల ఇపుడు మొత్తం కుటుంబాన్నంతా కూడా ఒకే unit గా తీసుకొని లెక్క కట్టాలి అలా కాకుండా యింట్లోఉన్న మైనర్ పిల్లలని, ముసలివాళ్లని, యింకా ఆడవాళ్లను అందరినీ వేర్వేరుగా చూపి లెక్క కడుతున్నారు కుటుంబాన్నంతా ఒకే unit గా లెక్క కట్టి పన్ను విధిస్తే ప్రభుత్వానికి చాలా ఆదాయం వస్తుంది ఇపుడు ఈ బిల్లులో ఇటువంటి దేమీలేదు కాబట్టి ప్రభుత్వ ఉద్దేశమే భూస్వాములకు పన్నులు అధికముగా పడకుండా చూచినట్లు దీంట్లో కనపడుతుంది విడివిడిగా కుటుంబంలో ఎంత మంది పేరున ఉన్నప్పటికి అంతమందికీ వేర్వేరుగా లెక్క కట్టేటట్లుగా కను పడుతోంది అందువల్ల ప్రభుత్వానికి నిజంగా లోటును పూడ్చుకోవాలి, అనే టటువంటి ఉద్దేశమే ఉండిఉంటే, అందుకుగాను ఎక్కువ ఆదాయం వచ్చేవాళ్ల మీద పన్నులు వేయాలనేటటువంటి ఉద్దేశమే ప్రభుత్వానికి నిజంగా ఉన్న ట్లయితే ఈ విధంగా ఒక కుటుంబం అంటే ఏమిటో చెప్పిఉండేవారు వాళ్లం దర్నీ కూడా ఒక యూనిట్ గా తీసుకొని, పన్ను వేసేటట్లయితే ఎక్కువరాబడి వస్తుంది. కాని ఈ విధంగా చేయడంలేదు. అంతేకాకుండా యిప్పటికి 2 సంవత్సరాలకు ముందే ఈ Surcharge Bill వచ్చింది. దానిమీదట

లెక్కలు తీశారు ఇపుడు మళ్ళీ Ordinance వచ్చింది ఈ Ordinance ప్రకారం ఇంకొక నెలలోనే ప్రభుత్వానికి లెక్కలన్నీ కూడా వచ్చేస్తున్నాయి అటువంటపుడు ఒక firka ను మాత్రమే ఇపుడు లెక్క కడతామని చెప్పారు అందువల్ల ఆ విధంగా ఒక firka నే లెక్క కట్టాలా ? ఒక్కొక్కరికి 10 వేలు, 15 వేలు ఎకరాలు ఉన్నటువంటి వాళ్లు, మంచి డెల్టాలో భూములున్న వాళ్ళు, అనేక లక్షల ఆదాయం సంపాదించే వాళ్ళు కూడా అనేక రకాలుగా అనేకమంది పేర్లను వేసో, లేకపోతే ఏ చెఱకు మిల్లుల పేర వేసో ఈ విధంగా చాలా అధిక ఆదాయం తిస్తున్నారు అటువంటపుడు ఆ విధంగా ఒక firka అని చెప్పి limit పెడితే, ఒక 50 వేల ఎకరాలు ఉన్న వంటే ఆ భూమిఅంతా ఒకే block లోనే ఉండదు ఒక తాలూకాలోనో, జిల్లాలోనో ఉంటుంది ఇపుడు ఇందులో జిల్లా కలెక్టర్లకు, Revenue Divisional Officers కు లెక్కలు తీసుకొనే అధికారం యిచ్చారు రెవిన్యూ మంత్రిగారు అది ఎపుడో వచ్చే సంవత్సరం మాట, ఆ విధంగానే అట్లా లెక్కలు వచ్చినపుడే చేస్తామన్నారు 1955 లో సర్‌చార్జి బిల్లు వచ్చింది ఇప్పటికింకా వసూలు చేస్తున్నారు అందులో ఈ సర్‌చార్జి వచ్చేది, ఆఖరివాయిదాలో వసూలు చేస్తూ ఉంటారు. అటువంటపుడు May నెల నాటికి ప్రభుత్వానికి లెక్కలు రావా ? వీటన్నిటినీ బట్టి మొత్తంగా మనం చూసినట్లయితే ఈ ప్రభుత్వంలో ఇప్పటికి బాగా ఆదాయం వచ్చేటటువంటి భూస్వాముల యొక్క ప్రాబల్యం ఒక్క అంగుళం కూడా తగ్గలేదనీ, రోజు రోజుకు ప్రజల ఆందోళన ఎక్కువైతే మాటలు మారుస్తారు కాని ఇంకొక మాటద్వారా అయినా సరే ధనికులకు నష్టంరాకుండా చూస్తారు graded tax వద్దూ అని చెప్పిందెవాళ్ళు, దీనిని వేయవలసి వచ్చినపుడు, ఈ Graded tax ఆదాయం వచ్చేవాళ్ళమీద సాధ్యమైనంతవరకు ఎక్కువ కాకుండా యివి మళ్ళీ సామాన్య ప్రజలమీద వేసేదానికి చూశారు ఆదాయం వచ్చేవాళ్ళమీద వేయడం ఏ విధంగా తగ్గించుకుందామా అని అందులోనూ ముఖ్యంగా డెల్టా area లో ఉండి బాగా ఆదాయం వచ్చేవాళ్ళను ఇంకేవిధంగా తగ్గిస్తామా అనే ఆలోచన మొత్తం ఈ బిల్లు అంతా చూస్తే కనపడుతోంది అందువల్ల మనం taxes వేయాలన్నపుడు, ఈ విధంగా ఉండకుండా ఎక్కువ ఆదాయం వచ్చేవాళ్ళపైన పన్నును వేస్తే ప్రభుత్వానికి ఎక్కువరాబడి వస్తుందని మనవిచేస్తున్నాను భారత దేశం అంతటిలోకి మనరాష్ట్రంలో ఇక్కడ అభివృద్ధి పనులకు పెట్టేటటువంటి ఖర్చు చాలా తక్కువ మొత్తంమీద ఇతర రాష్ట్రాలలో ఖర్చు ఏవిధంగా చేస్తున్నారో అంతకన్న కూడా తక్కువ ఖర్చు మన రాష్ట్రంలో చేయుచున్నారు.

కాని పన్నులు వేసే విషయం వచ్చేటప్పటికి భూమిమీదనే ఎక్కువ పన్ను వేస్తున్నారు భూమిమీద ఆదాయం వచ్చేవాళ్ళకి ఉండేటటువంటి పన్నులు రద్దుచేస్తున్నారు మనకన్న చిన్న రాష్ట్రంగా ఉండి అక్కడ నీటి తీరువా గాని, సర్చార్జిగాని వేయకుండానే ఆదాయం వచ్చేవారిపైననే భూమి పన్ను పెంచి కేరళ రాష్ట్రప్రభుత్వంవారు లోటు బడ్జట్టు లేకుండా చేసుకున్నారు ఇక్కడకూడా మనం భూమిపై ఆదాయం వచ్చేవారిపైననే పన్ను వేసి, లోటు బడ్జట్ లేకుండా చేసుకోవచ్చు కాని ప్రభుత్వంవారు ఈ భూస్వాముల ఆదాయం ఇంకా పెంచాలి, వారికి ఏమీ పన్నులు వేయకూడదనే వైఖరి మానుకున్నట్లయితే మనకు ఈ లోటు బడ్జట్టు ఉండకపోవును మన లోటు బడ్జట్ సుమారు 5 కోట్ల రూపాయలు కేరళ మనకన్న చిన్న రాష్ట్రం మనకన్న అక్కడ పెద్ద పరిశ్రమలు లేవు వారు ఆదాయం వచ్చేవారిమీద పన్నులువేసి లోటు బడ్జటును పూడ్చుకున్నారు ఆ విధంగా మనం మాత్రం ఎందుకు చేయకూడదు ? కేంద్రప్రభుత్వం సూచించినట్లు వ్యవసాయ సంపద మీద పన్నులు ఎందుకు వేయకూడదు ? ఇప్పుడు ఒక్కొక్క వ్యవసాయ సంపద లెక్కకడితే దానిమీద ఆదాయంవచ్చే అవకాశాలున్నాయి మన ఖర్చుల్లో అనేక దుబారాలు చేస్తున్నారు జమీందారులకు ఇచ్చే నష్టపరిహారం ఎందుకు వాయిదా వేయకూడదు ? కేంద్రప్రభుత్వం నుంచి మనకు రావలసిన వాటిని ఎందుకు తెచ్చుకోకూడదు ? ఇటువంటి ప్రయత్నాలు ఏమీ చేయరన్నమాట ఇపుడు నైజాం నవాబుకు కేంద్రప్రభుత్వ 50 లక్షల రూపాయలు భరణం ఇస్తుంటే మన ప్రభుత్వం ఏమీ ప్రశ్నించదు జమీందారులకు నష్ట పరిహారం స్వయంగా ఇస్తున్నారు కాని వృత్తులు పోయినవారికి ఏ విధమయిన నష్టపరిహారం లేదు వారికి జీవనోపాధి లేకపోయినా నష్టపరిహారమయినా లేదు ఇపుడు మద్యపాన నిషేధం పెడితే వారికి ఈరోజు జీవనోపాధి లేదు వారికి నష్టపరిహారం లేదు ఖర్చులు తగ్గించుకోమంటున్నారు కాని పెద్ద ఉద్యోగుల జీతాలు తగ్గించడానికి పూనుకోవడంలేదు ఈ శాసనసభలో ప్రభుత్వ ఖర్చులకు సంబంధించిన అనేక విషయాలు తెలియచేశినవి ఇంతవరకు పరిశీలించ లేదు

వ్యవసాయానికి సంబంధించినంతవరకు నెల్లూరుజిల్లాలో 750 taken over గ్రామాలుంటే అక్కడున్న చెరువులన్నీ చాలా హీనస్థితిలో ఉన్నాయి. Delta areas లో, కూడా remodel జరుగనిదే కొన్నిగ్రామాలకు నీరు పారదని, ఆందోళన చేస్తే మూడు సం॥ల నుంచి విచారణకూడ జరిపించలేదు అందువల్ల ఖర్చులు తగ్గించుకొని ఆదాయం వచ్చేవారిపై పన్నులు వేయాలిగాని లేని యెడల ఇటువంటివి సరిగాదని మనవిచేస్తూ శలవు తీసుకొంటున్నాను.

[Shri Appa Rao Shetkar (Narayankhed)] شری اپا راؤ شیٹکر (نارائن کھیڑ)

—محترم صدر—اسی اسمبلی، اس ایوان میں ہم نے دو سال پہلے یہ آواز اٹھائی تھی کہ حیدرآباد اسٹیٹ کے حصہ تلنگانہ کو آندھرا میں ضم کیا جائے۔ کرنول اور حیدرآباد ملکر ایک ہوجائیں۔ یہ دعوت آندھرا کو ہم نے دی تھی لیکن اسلئے نہیں کہ کرنول سے لوگ آئیں تو یہاں کا شہر زیادہ خوبصورت ہو جائیگا۔ اسلئے نہیں کہ آندھرا کے لوگ ملنے سے آبادی بڑھ جائیگی بلکہ یہ دعوت اسلئے دیگئی تھی کہ چونکہ تلنگانہ کا کسان اور اس میں خاصکر پائیگاہ اور جاگیرات کا کسان۔ آندھرا کے کسان سے بہت پیچھے ہے۔ وہاں کا کسان خوشحال، دھنوان اور محنتی ہے۔ اسلئے آندھرا کا کسان اچھا ہونے کے ناتے آندھرا میں ضم ہوجائیں تو ہم بھی اور ہمارے کسان بھی زیادہ خوشحال ہو سکتے ہیں اور ترقی کرسکتے ہیں، یہ دعوت دیگئی تھی۔ یہاں قابل ذکر اور سب سے اہم بات یہ ہے کہ ہماری مالگزاری کی شرح کسقدر حد تک بڑھی ہوئی ہے۔ اسکو کم کرنے کے لئے شاید کالا وینکٹ راؤ صاحب نے اب تک غور نہیں کیا ہے یا ابھی وہ یہاں کے حالات کا ٹھیک ٹھیک جائزہ نہیں لینے پائے ہیں میں انہیں بتلاؤں کہ جبکہ زمین کی مالگزاری جو آندھرا میں دو چار آنے ہے وہ یہاں پانچ روپیہ تک ہے۔ اور تری کا ہمیں چالیس روپیہ فی ایکڑ تک دھارا دینا پڑتا ہے۔ ویلوڈی گورنمنٹ اور رام کشن راؤ گورنمنٹ کے زمانہ میں اس جاگیری علاقہ کی رعایا نے جو کوشش اور جدوجہد کی اس کی بناء پر ۲۵ فیصد مالگزاری برآئندہ کی گئی۔ لیکن آج بھی وہ مالگزاری برآئندہ ہے اور وہ ابتک ہمارے نام سے برآئندہ چلی آتی ہے۔ آج بھی ہم اوس بوجھ سے لدے ہوئے ہیں۔ اس بوجھ کو دیکھکر ہم رعایا جاگیری پر ایک ظلم ڈھایا جارہا ہے۔ اسکو معاف کرنا چاہئے میں یہ کہونگا کہ ہم مالگزاری دینے کے موقف میں نہیں ہیں کیونکہ ہمارے ایک ایکڑ میں ایک تھیلہ جوار بھی نہیں ہوتی۔ یہ جاگیری علاقہ جات کا حال ہے۔ اسکے ساتھ ساتھ مجھے یہ کہنا ہے کہ وہاں مواضعات میں پینے کے پانی کی باؤلی تک نہیں ہے۔ آج میرے تعلقہ میں جہاں دو ہزار آدمی رہتے ہیں ایک بھی ہائی اسکول نہیں ہے۔ ایجوکیشن منسٹر اس بات پر غور فرمائیں کہ نارائن کھیڑ تعلقہ میں ایک بھی ہائی اسکول نہیں ہے! آج بھی میرے تعلقہ میں دو چار باؤلیوں کے سوائے پچاس مواضعات ایسے ہیں جہاں تین تین میل سے پانی لانا پڑتا ہے۔ جہاں چارپائی پر بیٹھکر اشنان کرتے ہیں اور کپڑے دھوتے ہیں اوسی پانی کو پینا پڑتا ہے۔ یہ چھ سو صفحات کی ضخیم کتاب جو ہمیں دیگئی ہے اس میں روڈس کو انکلوڈ کیا گیا تھا ابھی تک وہ بھی نہیں بنے ہیں۔ اتنا سب کچھ ہونے کے بعد بھی دس سال میں بھی ہمیں جتنا آگے بڑھنا چاہئے تھا ہم نہیں بڑھ سکے

ہیں۔ لیکن پھر بھی آج جاگیری رعایا پر سرچارج (Surchapge) کے نام سے ٹیکس لگایا جا رہا ہے۔ ہم جانتے ہیں کہ حکومت کی مشکلات اپنی جگہہ پر ہیں۔ ابھی تلنگانہ اور آندھرا کو مساوی نہیں کیا جاسکتا لیکن کم از کم جاگیرات کے علاقوں کو خالصہ کے برابر تو کیا جائے۔ آج کئی مواضعات غیر بندوبست کے پڑے ہوئے ہیں۔ دس سال سے چیخ و پکار کرنے کے باوجود بھی ہماری رعایا جہاں تھی وہیں ہے تو کیا آج کے بدلے ہوئے حالات میں، اس گرانی میں ہمارے پاس کی رعایا اس بوجھہ کو برداشت کرسکے گی؟ اسپر آپ خود غور کریں۔ سنجیدگی سے غور کریں۔ بمصداق اس مصرع کے

"مرض بڑھتا گیا جوں جوں دوا کی"

جیسے جیسے ہم آواز اٹھا رہے ہیں ویسے ویسے ہمارے پاس ٹیکس بڑھتے ہی جا رہے ہیں۔ آج جاگیری علاقہ جات کا تین چوتھائی علاقہ غیر بندوبست شدہ ہے ارائن کھیڑ، ظہیرآباد، نرساپور اور گجویل میں آج بھی سنگین دھاراجات ہیں۔ ابتک انکو تلنگانہ کے مماثل بھی نہیں لایا گیا ہے تو پھر کیا جاگیری علاقہ جات کے لوگوں کا دھارا آندھرا کے مماثل ایک سو سال میں آئیگا؟ میں تو اس کی کوئی اُمید نہیں رکھتا۔ آج کلا وینکٹ راؤ صاحب ریوینیو منسٹر ہیں میں اُن سے کہونگا کہ وہ حکومت کی مجبوریاں ہیں تو ضرور سرچارج لگائیں لیکن جاگیری علاقہ جات کو کم از کم اس سے مستثنیٰ رکھیں۔ اگر آنریبل منسٹر آکر دیکھیں تو میں بتلاؤنگا کہ نارائن کھیڑ میں ایک ایک ایکڑ زمین ایسی ہے جہاں بندوبست کے کئی عہدہ‌دار آئے۔ رام کشن راؤ کے زمانہ میں بھی آئے تو ہم نے چیخ و پکار کی لیکن کچھہ نہ ہوا۔ اس لئے ہم آپ سے اُمید رکھتے ہیں کہ جوگی پیٹھہ اور سنگاریڈی جو ملحقہ علاقے ہیں کم از کم انکے برابر دھارا کیا جائیگا۔ اس کے بعد ہم سرچارج برداشت کرنے کے لئے تیار ہیں۔

اسکے ساتھہ ساتھہ مجھے یہہ کہنا ہے کہ فرسٹ فائیو ایر پلان میں کچھہ نہ ہوا تو کم از کم سکنڈ فائیو ایر پلان میں اوس علاقہ کے لئے جہاں تین تین میل سے پانی لانا پڑتا ہے جہاں نارو کے مرض میں کسان ہمیشہ مبتلا رہتا ہے کچھہ کیا جائے۔ اس جاگیری علاقہ کیلئے سہولتیں فراہم کرنے کی میں آنریبل منسٹر فار لوکل گورنمنٹ سے بھی اپیل کرتا ہوں اور اُمید کرتا ہوں کہ وہ ہمدردانہ غور کرینگے۔ اسی طرح کی آشا رکھتے ہوئے میں ریوینو منسٹر صاحب سے پرزور اپیل کرتا ہوں کہ ہمارے علاقہ کے مالگزاری دھاراجات کو خالصہ کے دھاراجات کے مماثل کیا جائے۔ اسکے بعد کوئی ٹیکس عائد کیا جائے تو اس کو ہم قبول کرنے کے لئے تیار ہیں۔

శ్రీ టి వి. రాఘవులు అధ్యక్ష మహాశయా! సభవారి ఎదుట ప్రవేశ పెట్టబడిన సర్ ఛార్జి బిల్లును నేను బలపరుస్తున్నాను అయితే యీ బిల్లును బలపరచుటలో ఒకే ఒక ఉద్దేశం ఉన్నది చాలామంది గౌరవసభ్యులు మాట్లాడుతూ ఎప్పుడు పన్ను వేసినా ఒక్క రైతే దొరికాడా అని మాట్లాడటం చాలా విచారకరమైన విషయం ఇంతో అంతో పన్ను ప్రతిపౌరుడూ యిస్తూనే ఉన్నాడు. డైరెక్టుటాక్సు కాకపోయినా, ఇన్ డైరెక్టు టాక్సు అయినా- ప్రజలు యిచ్చుకుంటున్నారు మనదేశం ముందుకు పోవాలని, గ్రామీణప్రజలు యింకా సౌఖ్యంగా జీవించాలని, వారికి అన్నిరకాల సదుపాయాలు కలిగించాలనే ఉద్దేశంతో మనం ప్రణాళిక నిర్మించుకొన్నాము నీటివనరులు లేవని, మరమ్మతులు లేక చెరువులు ఎండిపోతున్నాయని చెబుతున్నందున రైతుకు యితోధికంగా సదుపాయాలు చేయటానికి మనం యిటువంటి పన్నులు వేసుకొని ముందుకు నడవలసివస్తున్నది ఈ బిల్లులో ఆశించినటువంటి డబ్బు గవర్నమెంటు వారికి ఎంతవరకు వస్తుందనే అనుమానం మాత్రం నాకు ఉన్నది కొంతమంది గౌరవసభ్యులు మాట్లాడుతూ ధనిక భూస్వాములమీద మాత్రమే పడే ఆదాయపు పన్ను ఎందుకు విధించుట లేదు ? అన్నారు రేపో మాపో మనం భూసంస్కరణలు ప్రవేశపెట్టాలనే దృష్టితో ఉన్నాము భూమికి గరిష్టప్రమాణం పెట్టిన తరువాత, ప్రభుత్వమునకు రాబడి ఎంతవరకు వస్తుందో మనం ఊహించవచ్చును ఆదాయపు పన్ను వసూలుచేయుటలో కొన్ని చిక్కులు ఉన్నవి తన లెక్కలు తయారుచేసేందుకు కూర్చునే ఓపికగాని, పరిస్థితులుగాని రైతుకు ఉండవు అది స్థిరమైన రాబడిగా ప్రభుత్వం అంగీకరించటానికి కూడ చాలా యిబ్బందులు ఉన్నవి అయితే యీ పన్నుల విషయంలో మనం ఒక పన్ను ప్రతిపాదిస్తే, గౌరవ సభ్యులు మరొక పన్నును గురించి చెప్పుట జరిగింది. అది చాల విచారించవలసిన విషయం ఇటీవల లేనిపోని ప్రజాందోళనతో గరిష్ట ప్రమాణాలు వస్తాయనే భయంతో రైతులంతా తమ భూములను అనేక రకాలుగా అన్యాక్రాంతం చేస్తున్నారని చెపుతున్నారు. పట్టాదారుని దృష్టిలో పెట్టుకొని ఈ సర్ ఛార్జీ విధింపుబిల్లును వర్తింపచేస్తారా ? లేక కుటుంబాన్ని ఒక యూనిట్ గా భావించి చేస్తారా ? అంటే నేను అర్థం చేసుకున్నంతవరకు ఒక పట్టాదారుని దృష్టిలో పెట్టుకొని చేయవలసియుంటుందనిఅనుకొంటున్నాను. అటువంటప్పుడు ప్రభుత్వంవారు ఆశించిన పన్ను రాదేమో నని భయముకూడ నాకు ఉన్నది. మనదేశాన్ని ముందుకు తీసుకుపోవాలంటే పన్నులు వేసుకోకుండా పనులు చేసుకొనలేము. లోతునీటిలోకి వెళ్ళాలంటే ఈతరావాలి. ఈత వస్తేగాని లోతునీటిలోకి వెళ్ళుటకు వీలులేదు. ఇదిదృష్టితో లేకపోతే దేశం యథాస్థితిలోనే ఉంటుంది మనము ముందుకు పోయే

స్థితిలో ఉండెను అందుచేత వాదోపవాదాలతో నిమిత్తం లేకుండ దేశాభ్యున్నతి దృష్ట్యా ఆలోచించాలి రైతుకు ఇతోధిక సదుపాయం కలుగజేస్తూ రైతుకు పండించే పంటకు గిట్టుబాటుధరను ఏర్పాటుచేసి, రైతుకు కావలసిన నీటివనరులు, మంచిమంచి విత్తనాలు, మార్కెటింగ్ ఫెసిలిటీస్ యిటువంటి సదుపాయాలు యితోధికంగా చేసినట్లయితే మనం వేసేపన్ను ఎక్కువభారం అనిపించదు. ఇప్పుడు రైతు దీనివల్ల కృంగిపోతున్నాడనే వాదము సహేతుకము కాదని మనవిచేస్తూ యింతటితో విరమిస్తున్నాను.

*శ్రీ పి. గోపాలురెడ్డి (తిరుత్తని - జనరల్) అధ్యక్షా ఈనాడు మన రెవిన్యూ మంత్రిగారు ప్రవేశపెట్టిన యీ బిల్లు ఒకటేగాక, యింకా రెండు మూడు బిల్సు రాబోతున్నాయి అయితే ఈ బిల్లులను సమర్థించక తప్పదు మన అభివృద్ధి ప్రణాళికలలో ఉద్దేశించిన కార్యక్రమమును జరుపుకొనుటకు, ఈ పన్నుల విధానం అవసరమనేది గుర్తించి, ఆ సూత్రంమీద ఆధారపడి మన ప్రభుత్వం డబ్బును పన్నుల రూపంగా సేకరించి, ప్రణాళికా కార్యక్రమమును నెరవేర్చుటకు పూనుకొంటున్నారు అందులో ఏమీ సందేహంలేదు అయితే ఈ సర్‌ఛార్జి బిల్లుమీద కొన్ని అభిప్రాయాలు చెప్పవలసియున్నది ఈ పన్నును గ్రేడెడ్‌గా పెట్టినారు ఈ గ్రేడెడ్ విధానంవల్ల వచ్చే రెవిన్యూ చాలా కొద్దిగా ఉన్నది యూనిఫారమ్‌గా ఉంటే, లెక్కలు తయారు చేయడానికికూడ చాలా సులభంగా ఉండేది తెలంగాణా ప్రాంతంలో ఉండే agricultural income tax ను రిపీల్‌చేసి అచటి మెట్ట భూములకు మాత్రం ఈ సర్‌ఛార్జిని ఉంచారు ఆంధ్ర ప్రాంతంలో మెట్ట, నంజ భూములలో వాటర్ టాక్సు పోను మిగతా భాగానికి సర్‌ఛార్జి ఉన్నదన్నారు. ఇంత confusion ఉంటే, ఈ లెక్కలన్నీ, ఏమీ తెలియని గ్రామోద్యోగస్థుల నెత్తినపెట్టితే, వారు —నూరు రూపాయలకు పైబడే వారినందరినీ తగ్గించి 99, 98, 80 రూలకు రాబడి తగ్గించి, చూపించే అవకాశాలుంటాయి కాబట్టి మద్రాసు ప్రభుత్వంవలె గ్రేడెడ్ టాక్సెస్ లేకుండా యూనిఫారమ్‌గా పెట్టినట్లయితే చాలా బాగుంటుందని సలహా యిస్తున్నాను.

తెలంగాణా ప్రాంతంలో అధిక తీరువలు ఉండటం సహజమే. తిరిగి వారికి బాధ కలిగించటం తప్పు ఆంధ్ర ప్రదేశ్ మొత్తంమీద, యూనిఫారమ్ పద్ధతి రావాలంటే, ఎక్కడైనా అధికంగా ఉన్నచోట్ల కల్గించి అంతా యూనిఫారమ్‌గా ఉండేపద్ధతి పెట్టినట్లయితే బాగుంటుంది. ఇప్పుడు దీనివల్ల కొద్ది లక్షల ఆదాయం మాత్రమే రాగలదు. ఇటువంటి బిల్లుల objects తో యింత ఆదాయం ప్రభుత్వానికి వస్తుందనే విషయంకూడ చూపించాలి. ఆ విధంగా

చూపిస్తే మాకు సూచనగా ఉంటుందని నా అభిప్రాయం ఇప్పుడు దీనివల్ల వచ్చే ఆదాయం చాలా తక్కువ ఒక గ్రామంలో 200 పట్టాదార్లు ఉంటే, 150 మంది దగ్గర ఈ అణా, బేడ, మూడణాలు, నాలుగణాలు లెక్కన వసూలు చేయవలసి వస్తుంది ఇటువంటి పద్ధతికంటే యూనిఫారమ్ పద్ధతి ఉంటే మంచిదని సలహా యిస్తున్నాను ఈ పద్ధతిగా యీ పన్ను వేసినారని, ఆ పన్ను వేసినారని, యీ ప్రచారమునకు ప్రభుత్వం గురికాకుండా, యిటువంటి టాక్సులు వీలైనంతవరకు లేకుండాచేసి, అధిక ఆదాయం సంపాదించడానికి నాకు తోచిన యింకొక మార్గము మనవి చేస్తున్నాను మోటారు ట్రాన్స్‌పోర్టు విషయంలో మనప్రభుత్వం ఆలోచిస్తున్నది ఈనాడు 620 బస్ రూట్సు మన ఆంధ్ర ప్రాంతంలో ఉన్నవి తెలంగాణా ప్రాంతంలో మోటారు ట్రాన్స్‌పోర్టు ప్రభుత్వ స్వాధీనంలోనే ఉన్నది దానిని గురించి మాట్లాడవలసిన అవసరంలేదు ఆంధ్ర ప్రాంతంలో చూస్తే, అక్కడ కొత్తగా ఒక బస్సు వేయవలెనంటే 70, 80, 100 అప్లికేషన్లదాకా వస్తాయి కాంపిటీషన్ ఎక్కువగా ఉన్నది అటువంటి పరిస్థితులలో ఆ బస్ రూట్లమీద ప్రభుత్వం ఆదాయం తీయవచ్చు ఎవరికీ బాధలేకుండా, బస్-ఓనర్‌కు ఇబ్బందిలేకుండా, ఒక్కొక్క బస్సు రూటుమీద కనీసం 7 వేల రూపాయల ఆదాయం తీయవచ్చు. ఇటువంటి భూమిశిస్తు సర్‌ఛార్జీ బిల్లులకంటే, బస్ రూట్సు విషయం పరిశీలించి చేస్తే ప్రభుత్వమునకు ఎక్కువ ఆదాయం చేకూరుతుందని నేను దృఢముగా చెప్పగలను ప్యాసింజర్సు టాక్సుమీద సర్‌ఛార్జీ లోగడ ఒక (పాత) దమ్మిడీ వేసియున్నారు. ఇప్పుడు నయాపైసా లెక్కలలో ఆదాయం పొందేమార్గం ప్రభుత్వం వెదికింది దానినికూడా రెండు నయాపైసలు చేస్తే, దానివల్ల ఏ ఒక్క వర్గానికి దెబ్బలేకుండా ఆదాయం వస్తుంది ఆ ప్రకారం చేస్తే indirect tax గా కొన్ని లక్షల రూపాయలు ప్రభుత్వానికి వస్తుంది నేను చేసిన సూచనలవల్ల ఒక కోటి రూపాయలు ప్రభుత్వానికి వస్తుంది. ఇటువంటి మార్గాలు అన్వేషించి, రైతులమీద లేకుండాచేసి చిల్లర టాక్సులు రైతులమీద వేశారనే అపవాదు పోగొట్టుకుంటారని మనవి చేస్తున్నాను. ఇటువంటి చిల్లర టాక్సులవలన మాకు తలవంపులుగా ఉంటున్నది మీరుపోయి టాక్సును ఒప్పుకొని వస్తూంటారు. రైతులకష్టాలు మీకు తెలియటంలేదు" అని రైతులు మాతో అంటూంటే వారికి ఏమి సమాధానం చెప్పాలో అర్థంకావటంలేదు కాబట్టి యీ సర్‌ఛార్జి బిల్లును యీ ఒక సంవత్సరానికే నియమితం చేయవలసిందిగా కోరుతున్నాను. నేను చెప్పినటువంటి సలహాల ప్రకారం వచ్చేటటువంటి ఆదాయాన్ని దృష్టిలో పెట్టుకొని యీ సర్‌ఛార్జి

ఒక సంవత్సరానికి మించకుండా ఉండేందుకు ఆలోచించవలసిందిగా కోరుతూ, నాకు యీ అవకాశం ఇచ్చినందుకు అధ్యక్షులకు కృతజ్ఞత తెలియజేస్తున్నాను

*శ్రీ బసవ మానయ్య (అందోలు) అధ్యక్షా, ప్రభుత్వంవారు ఇప్పుడు నీటిపారుదలపైన సర్‌ఛార్జి పన్ను విధిస్తున్నారు హైదరాబాదు మోటారు వెహికిల్స్ పన్ను, కోర్టుఫీజు, వ్యాపార పంటలపై టాక్సు, మొదలగు పెక్కు విధములైన పన్నులు డైరెక్ట్‌గా గాని, ఇన్‌డైరెక్ట్‌గా గాని ప్రభుత్వంవారు తీసుకువస్తున్నారు.

ప్రథమమున కల్వ సూర్యనారాయణగారి ఇంట్లో విశాలాంధ్ర సమావేశము అయ్యదేవర కాళేశ్వరరావుగారి అధ్యక్షతన జరిగింది ఆ తర్వాత మేము మా ప్రాంతానికి వెళ్ళినప్పుడు ప్రచారం చేశాము "ఆంధ్రలో తరి భూమిమీద 10 రూపాయలవరకు పన్ను ఉన్నది, తెలంగాణాలో మెదక్‌జిల్లాలో 30 రూపాయలవరకు పన్నుఉన్నది, విశాలాంధ్రవస్తే తెలంగాణాలో భూమి శిస్తు తగ్గుతుంది" అని ప్రచారం చేయటం జరిగింది తెలంగాణా ప్రాంతంలో మాలీపటేల్, పోలీసు పటేల్ చాలా సంవత్సరాలనుండి పరంపరగా గ్రామాలలో ఉండి సాగిస్తున్న అల్లరులను దూరం చేయటానికి వారి తబాదిలాలు తీసుకువస్తారని అనుకొన్నారు విశాలాంధ్రవస్తే ఇటువంటి మంచి విషయాలు జరుగుతాయని ప్రచారం చేయబడింది కాని, ఇప్పుడు ప్రభుత్వం తెచ్చిన పన్నులు చూస్తే, రోజురోజుకు ఏ విధంగా పన్నులభారం పెరుగుతోందో బోధపడుతుంది. పన్నులు వేయటం మంచిదే పన్నులువేసి డబ్బు సంపాదిస్తే, ఆ డబ్బుతో మంచి పనులు జరుగుతాయి ఈ రోజున పల్లెలకు పోయిచూస్తే, అక్కడ మార్గాలు లేవు, రోడ్లులేవు, ఇండ్లవసతిలేదు అక్కడి పేదప్రజలకు ఇళ్ళుకట్టించే ప్రయత్నం చేయలేదు, ఆ విషయంగురించి ఇక్కడకువచ్చి తెలుసుకొంటే, ఆ తురక ఫైల్సు ఎక్కడో పడిపోయాయి అంటారు పది రూపాయలకన్నా ఎక్కువ భూమిశిస్తు చెల్లించుకొనేవారికి 18 నయాపైసలు, 100 రూ 500 రూ మధ్య భూమిపన్ను చెల్లించుకొనేవారికి 25 నయాపైసలు, 500 రూ పైన చెల్లించేవారికి 50 నయాపైసలు చొప్పున పన్ను హెచ్చు చేయబడుతున్నది. అసలే తెలంగాణా ప్రాంతంలో పన్నులు హెచ్చుగా ఉన్నవి ఇప్పుడు తిరిగి ఇంకా పన్ను హెచ్చించటం అవుతున్నది సమాజవాద దృక్పథం ప్రకారం దేశంలో ఉండే కూలీలకు రైతులకు మంచి సౌకర్యాలు కలుగుతాయని మన మంత్రులు, కేంద్ర నాయకులు, ఒకవైపున చెబుతున్నారు, ఇంకొక వైపున వీరిమీద పన్నులభారం ఎక్కువ చేస్తున్నారు ఎగ్రికల్చరల్ ఇన్‌కం టాక్స్ తీసివేస్తున్నారు. దీనివలన చిన్న రైతులకు లాభం లేదు. ఎగ్రికల్చరల్

ఇన్‌కంటాక్స్ కట్టేవి పెద్దరైతులు ఇప్పుడు ఎగ్రికల్చరల్ ఇన్‌కంటాక్స్ తీసివేయటంవల్ల వేల రూపాయలు గల భూస్వాములు లాభం పొందుతున్నారు మన ప్రభుత్వానికి రాబడి రావాలంటే, ప్రతిసంవత్సరం నైజాం గారికి ఇచ్చే 50 లక్షల రూపాయలు ఆపుచేయాలి ఇప్పుడు శాసనరీత్యా చూస్తే, వారికి అర్ధశేరు బియ్యం సరిపోతుంది వారికి ఇన్ని లక్షల రూపాయలు ఎందుకు ఇవ్వాలి ? నీటిపారుదల సౌకర్యాలు చూస్తే మా నియోజకవర్గంలో 60 చెరువులు చెడిపోయాయి వాటిని ప్రభుత్వం ఇంతవరకు మరమ్మతు చేయించలేదు టాక్సు ఎట్లా వేయాలి, టాక్సు ఎట్లా పెంచటము అన్నదే ప్రభుత్వము యొక్క దృక్పథం తప్ప, ప్రజలకు టాక్సు ఇవ్వటానికి శక్తి ఉన్నదా లేదా అన్నది గ్రహించటంలేదు రైతులకు టాక్సు ఇచ్చుకొనే శక్తిలేదు కాబట్టి యీ పన్నులు వేయకూడదని తెలియజేస్తూ, సర్చార్జి బిల్లును హృదయ పూర్వకంగా ప్రతిఘటిస్తున్నాను

*శ్రీ పి నరసింగరావు (హుజూరాబాద్ - జనరల్) అధ్యక్షా, ఈరోజు రెవిన్యూ మంత్రిగారు లాండ్‌కు సంబంధించి సర్చార్జిబిల్లు ప్రవేశపెట్టినారు నిన్న కేవలం ఆంధ్రప్రాంతానికి సంబంధించినంతవరకే వెట్ ఎసెస్‌మెంట్ బిల్లు ప్రవేశపెట్టినారు రేపు కమ్మర్షియల్ క్రాప్ టాక్సేషన్ బిల్లు కూడ ప్రవేశపెట్టబోతున్నారు ఈ విధంగా మూడు రకాలైన పన్నులను వేయటానికి ప్రభుత్వం ప్రస్తుతం తలపెట్టింది ప్రభుత్వం తలపెట్టిన యీ పన్నుల విధానాన్ని నేను పూర్తిగా ప్రతిఘటిస్తున్నాను శాసనసభలో ఉన్న మా పార్టీ సభ్యులు, బయట ఉన్న మా పార్టీ యీ పన్నుల విధానాన్ని ప్రతఘటిస్తున్నారు ప్రజలు ఎందుకు పన్నులు ఇవ్వాలని ప్రభుత్వాన్ని ప్రశ్నించదలచుకొన్నాను పన్నులు రెండు విధాలుగా ఉండవచ్చు ప్రజలకు కొన్ని లాభాలు చేకూర్చటానికి, వారు ఇవ్వగలిగినంత డబ్బును మాత్రమే తీసుకోవటం ఒక పద్ధతి ప్రజల శక్త్యానుసారం డబ్బు ఇవ్వవచ్చును అన్నది ఒక పద్ధతి మొత్తం సంఘ శ్రేయస్సుకు పనులు చేయటంకొరకు పన్నులు వసూలుచేయటం అన్నది, రెండవది ; సమాజంలో ఉన్న వ్యత్యాసమును తక్కువచేయటానికి యీ పన్నులు వేయటం అన్నది ఉన్నది. ఈ రెండింటిలో దేనిని అప్లయిచేసినప్పటికి, ఇప్పుడు వేసిన పన్నులను జస్టిఫై చేయటానికి అవకాశంలేదు ప్రభుత్వం ప్రజలకు కలుగ జేస్తున్న సౌకర్యాలేవీ లేవని చెప్పవచ్చును ప్రభుత్వంవారు "మేము నాగార్జున సాగర్ ప్రాజెక్టు కడుతున్నాము, పెద్దపెద్ద కార్ఖానాలు, గిర్నీలు ఏర్పాటు చేస్తున్నాము. రోడ్ల నిర్మాణం చేస్తున్నాము" అని చెప్పవచ్చును ఇదే ప్రోగ్రెస్ అనుకొంటే, యీ ప్రోగ్రెస్ తెలంగాణాలో నైజాం కాలంలోనే జరిగింది

నైజాం కాలంలోనే నిజాంసాగర్ అనే ప్రాజెక్టు తయారైంది తుంగభద్ర ప్రాజెక్టు ప్రారంభించబడింది హుస్సేన్‌సాగర్, హిమాయత్‌సాగర్ మొదలగు పెద్దపెద్ద తటాకాలు నిర్మించటము జరిగినది ఇవాళ ఉన్న యీ హైదరాబాదు పట్టణంకూడ ఆ కాలంలోనే నిర్మించబడింది అదే ప్రోగ్రెస్ అన్నట్లయితే, అటువంటి ప్రోగ్రెస్ మనకు అక్కరలేదు ఈనాడు దేశంలో ఉన్నటువంటి కోట్లకొలది సామాన్య ప్రజానీకంయొక్క ఆర్థిక పరిస్థితిని పైకి తీసుకురావటానికి ప్రభుత్వం చేస్తున్న పని ఏమిటి ? పూర్వం మొగలాయి కాలంలో రాజులు ఏవిధంగా అయితే ఆకాశంలో కూర్చుని, భూమిమీద ఉన్న ప్రజలను పైకిలాగాలనే విధంగా పరిపాలన సాగించేవారో, ఆదేవిధంగా యీనాడు కూడ ప్రభుత్వపరిపాలన జరుగుతోందేతప్ప, ప్రభుత్వం నడుపుతున్న వారు ఆకాశంనుంచి క్రిందకు దిగివచ్చి, క్రిందవాళ్ళను తమతోపాటు పైకి తీసుకువచ్చే ప్రయత్నం చేస్తున్నట్లు కనపడదు

రెండవవిషయము, ఈబిల్లునుగురించి ఆలోచించేటప్పుడు తెలంగాణాకు, ఆంధ్రకు రెండు తేడాలు ఉన్నవి ప్రస్తుతము రేట్లకు సంబంధించినంతవరకు ఆంధ్రలోకంటె తెలంగాణాలో average మీద రేట్లు చాలా ఎక్కువగా ఉన్నవని మనకందరికీ తెలుసు ఈ రెండు ప్రాంతాలలో ఉన్న రేట్లను గురించి Finance Commission వారు సమర్పించిన లెక్కలు నావద్ద ఉన్నవి ఎప్పుడో ఏ 30 సం క్రిందనో, 40 సం క్రిందనో resettlement జరిగేటప్పుడు Land Revenue System ఏ ఆధారాలమీద ఏర్పాటు చేశారో గాని, అప్పటినుంచి యిప్పటివరకు ఎన్నో మార్పులు జరిగినవి ఆనాడు లేనటువంటి ప్రాజెక్టులు యిప్పుడు వచ్చినవి Irrigation facilities, Communication facilities అప్పట్లో లేనటువంటివి యిప్పుడు వచ్చినవి ఆరోజులలో ఎక్కడచూచినా అడవులు ఉండేవి ఇప్పుడు అవి అన్నీ కొట్టివేసి పంటలు పండించుతూ అభివృద్ధి చేయడము జరుగుతున్నది కాబట్టి ఎన్నో మార్పులు జరిగినవి. Land Revenue assessment ఒక rational basis మీద జరుగుతున్నట్లు కన్పించదు. అంతా irrational basis మీద జరుగుతున్నది తెలంగాణాకు సంబంధించినంతమట్టుకు మాకు బాగా అనుభవము జమీందారీకి సంబంధించిన భూములమీద ఒక్కరినుంచే అయిదు అణాలు, ఆరు అణాలు వేయడము ఉన్నది కాని దాని ప్రక్కనే ఉన్న భూములు చాలా బక్కవిగా ఉన్నవైనను పది అణాలు, పదిహేను అణాలు, ఒక రూపాయి, రెండు రూపాయలు ఈ విధముగ హెచ్చు రేట్లు వసూలు చేస్తున్నారు. సెటిల్‌మెంటు జరిగే సమయములో ఎవరైతే పలుకుబడి గలవాడు, యివ్వగలిగినవాడు ఉన్నాడో, వాళ్ళకు లక్షలకొలది ఎకరాలు, జాగీర్లు

ఉన్నవారు తక్కువ assessment వేయించుకున్నారు పేదవాళ్ళకు, పలుకుబడి లేనివాళ్ళకు హెచ్చు చేశారు ఇదే రేట్లమీద వసూలు చేయడము జరుగుతూ ఉన్నది అయితే దేశము మొత్తముమీద యీ రోజున ఉన్న figures ను బట్టి చూస్తే ఆంధ్రలో మెట్ట భూములకు సంబంధించినంతవరకు గుంటూరు జిల్లాలో ఎకరానికి maximum rate పదిరూపాయలు చూపించారు చిత్తూరు జిల్లాలో minimum rate రు 2-8-0 లు చూపించారు అదే విధముగ శ్రీకాకుళం జిల్లాలో తొమ్మిది అణాలు చూపించారు అనంతపురం జిల్లాలో రెండు అణాలు మాత్రమే చూపించారు పశ్చిమ గోదావరి జిల్లాలో మాగాణీ భూమికి సంబంధించినంతమటుకు ఎకరానికి రు 14-4-0, అనంతపురం జిల్లాలో రు 1-2-0 చూపించారు ఈ రేట్లు జిల్లావారీగా చూస్తే చాలా తేడాలు కన్పిస్తున్నవి ఈ రేట్లను అన్నీచూస్తే, యిది ఒక irrational basis మీద వసూలు చేస్తున్నట్లు కన్పిస్తున్నది కాని, వీటికి ఒక standardised system కన్పించదు ఇకపోతే తెలంగాణలో ఈ రేట్లు ఏ విధముగ ఉన్నవో చూడండి మెట్ట భూమికి రు 3-6-10 మెదక్ జిల్లాలో ఉన్నది ఆదిలాబాదు జిల్లాలో రు 1-11-6లు ఉన్నది ఇది మెట్టకు ఉన్న maximum rate ఇక minimum rate చూస్తే రు 0-10-3 వరకు ఉన్నది ఇక మాగాణీభూమి రేటుచూస్తే రు 18-13-9 లు మెదక్ జిల్లాలో ఉన్నది ఆదిలాబాదు జిల్లాలో రు 6-13-9 లు ఉన్నది ఇంతే కాకుండా తెలంగాణలో బాగాయత్ భూములు అనేవి ఉన్నవి ఇవిఅన్నీ మెట్ట భూములు. వీటికి రేట్లు అయిదురూపాయలు, ఆరురూపాయలు, నాలుగురూపాయలు, ఈ విధముగ varying rates ఉన్నవి కాబట్టి తెలంగాణ మొత్తముమీద చూస్తే Land Revenue చాలాహెచ్చుగా ఉన్నదని చెప్పకతప్పదు. Incidence of Land Revenue తెలంగాణలో చూస్తే 4.73% పడితే, ఆంధ్రలో రు 3.24% పడుతున్నది Percentage of total national income కు ఎంత చెల్లిస్తున్నామని చూస్తే ఆంధ్రలో 4 0% పడితే, తెలంగాణలో 6 9% పడుతున్నది Per capita Revenue Tax చూస్తే ఆంధ్రలో 7.94% పడితే, తెలంగాణలో 12 29% పడుతున్నది. ఇక All India level లో చూస్తే 9.53% ఉంటే తెలంగాణలో 12 29% వరకు ఉన్నది. దీనినిబట్టి All-India level కంటె కూడ ఎక్కువే కన్పిస్తున్నది ఏవిధముగ చూచినప్పటికినీ తెలంగాణలో Land Revenue చాలా హెచ్చుగా ఉన్నదని Treasury Benches లోను, ప్రభుత్వ పక్షములో కూర్చున్నవారు అందరుకూడ ఒప్పుకోకతప్పదు ఈవిషయము తెలిసియుండినప్పటికినీ యిప్పుడు యింకా ఏవోకొన్ని exemptions అంటున్నారు. తెలంగాణలో యింతకు పైన Land assessment చేయబోయేది లేదు అని అంటున్నారు అయితే తెలంగాణలో మాగాణీభూమి ఎంతఉన్నది? చాలా

తక్కువగా ఉన్నది లెక్కలుచూస్తే ఆంధ్రలో 30 6% ఎకరాలు ఉంటే తెలంగాణలో 14 6% ఎకరాలు మాత్రమే ఉన్నది ఆంధ్రలో canals 17.7% ఉంటే తెలంగాణలో 2 7% వరకే ఉన్నది కాబట్టి యీ రెండు ప్రదేశాలలోను యింతంత తేడాలు ఉన్నవని స్పష్టమగుచున్నది అయితే దీనివల్ల ఏమి తేలుతున్నది ? ఈ రోజున తెలంగాణలో పన్నులభారము ఎక్కువగా ఉన్నదని స్పష్టము అవుతున్నది ఆంధ్రలోను, తెలంగాణలోను పన్నులభారము పోల్చి చూస్తే పంటలు విషయము తీసుకుంటే, రెండింటిలోను చాలా తేడా ఉన్నది ఆంధ్రలో పండిన పంటలలో చాలామటుకు తెలంగాణలో పండవు ఆవిధముగా చూచినప్పటికినీ తెలంగాణలో ఏపంటఅయితే అధికముగా పండిస్తున్నారో, అది కూడ ఆంధ్రలోకంటే తక్కువే ఇక పోతే ఖర్చులవిషయము చూద్దాము ఆంధ్రలో ఎకరానికి ఎంత ఖర్చు చేస్తున్నారో, తెలంగాణలో ఎంత ఖర్చు చేస్తున్నారో, వ్యత్యాసము పరిశీలించి చూడండి సగటున చూస్తే Agricultural and Communal Development క్రింద—ప్రభుత్వము వారి statistics ప్రకారముగానే నేను చెబుతున్నాను—రు 11-15-6 ఆంధ్రప్రదేశ్‌లో ఖర్చు చేస్తూవుంటే, All India level లో 14-11-8 ఉంటుంది Social Service క్రింద ఆంధ్రప్రదేశ్‌లో రు 10-5-6 ఖర్చుచేస్తే, మొత్తము భారతదేశములో రు 24-8-1 ఖర్చు చేస్తున్నారు. దీనివల్ల ఎంత తేడా ఉన్నదో చూడండి రు 200 కంటె ఎక్కువ ఉన్నదన్న మాట. మొత్తముమీద Second Plan క్రింద ఖర్చుమాస్తే సగటున మనం per capita expenditure ఇక్కడ రు 52-6-6 ఖర్చు చేస్తూంటే, మొత్తము భారతదేశములో రు 124-8-10 ఖర్చు చేస్తున్నారు అయితే యీవిధముగ ఏ measure తో, ఏ దృష్టితో మనము చూచుకున్నప్పటికీకూడ యీవాడు ఉంటే Land Revenue system ఏ విధముగ ఉన్నదంటే, చాలా irrationalగా నడుస్తున్నది. Rational గా లేదని ఒప్పుకోక తప్పదు మొన్నటి దినము మంత్రిగారు దీన్ని పరిశీలించి ఏదయినా ఒక సమగ్రమైన system ఏర్పాటు చేయటానికి ఒక కమిటీని వేయబోతున్నామని, ఆంధ్రలోను, తెలంగాణాలోనూ ఉన్న రేట్లు సమన్వయ పరచటానికి ఏర్పాటు చేయబోతున్నామని చెప్పారు. ఇది జరగబోతుందని ఒకవైపున చెబుతూవుంటే, రెండవ వైపున Taxation Enquiry Commission వారు 1953-54 సం॥లో యిచ్చిన రిపోర్టులో చూస్తే, యీ Revenue assessment పద్ధతి ఎప్పుడో జరిగినట్లు కనబడుతున్నది అప్పటినుంచి యీ పన్నుల విధానము చూస్తే చాలా irrational basis మీద నడుస్తున్నది ఇది ఒక standardised basis మీద తీసుకోవలసి ఉంటుందని సిఫార్సు చేశారు. అలాంటి measure take up చేయకుండా, యిప్పుడు మా

ఖర్చుకు డబ్బు అవసరమున్నదని, పన్నుల బిల్లును ఆ irrational basis మీదనే continue చేస్తూ పన్నులు హెచ్చింపుచేయటానికి తీసుకొని రావడము సమంజసము కాదు ఇప్పటికే రైతులకు పన్నుల భారము ఎక్కువగ ఉన్నదని ప్రభుత్వానికి ఎన్నోసార్లు విజ్ఞప్తులు యీ సభలో చేయడము జరుగుతునే ఉన్నది రైతులు యీ పన్నులవల్ల ఎంతబాధపడుతున్నారో, వారి యిబ్బందులు ఏమిటో అవి అన్నీ ఆలోచించకుండా యీ విధముగా flat rate మీదనె పన్నులు విధించి వసూలుచేయ పూనుకోవడ మనేది సమంజసము కాదు దీన్ని మేము తప్పకుండ ప్రతిఘటించవలసి ఉంటుంది. అంతేకాకుండా ఆంధ్రప్రదేశ్ ఏర్పాటు అయ్యేటప్పుడు ఆంధ్ర అని, తెలంగాణ అని, తెలంగాణలో పెద్దపెద్ద వివాదాలు ఉండేవి అప్పుడు తెలంగాణను బలపరచే వారు statistics తీసుకొని ఆంధ్రకు, తెలంగాణాకుపోల్చి ఇక్కడ తెలంగాణాలో మేము self sufficient గా ఉంటున్నాము, 'అది ఉన్నాము ఇది ఉన్నాము' అని అంటూ, మామీద పన్నులభారము యిదివరకే ఎక్కువగా ఉన్నది, యికమీదట వేయకండి, అని చెప్పుకునేవారు ఇక ఆంధ్రప్రదేశ్ కోరేవారు వేరే arguments యిచ్చేవారు. మనకు యిక్కడ పన్నులు హెచ్చు, ఆంధ్రలో చాలా తక్కువ, ఆంధ్రప్రదేశ్ ఏర్పాటుకు ఒప్పుకుంటే, మనకుగూడ వాళ్ళతోబాటు పన్నులు తగ్గింపు చేయించుకోవచ్చు అని చెప్పేవారు బసవ మానయ్యగారు కూడ ఈ విషయం చెప్పారు Land Revenue గాని, Motor Vehicles Taxation కాని, Court fees కాని, Commercial crops గాని యివిఅన్నీ తెలంగాణలో చాలా హెచ్చుగా ఉన్నవని మనము ఒప్పుకోకతప్పదు అప్పుడు ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన సందర్భములో ముఖ్యంగా ప్రభుత్వపక్షమువారు చాలా మంది champions ఉండేవారు ఈ రోజున వారందరు ఏమి అయిపోయారో మాకుమాత్రము కన్పించడములేదు అయితే యీ రోజున పన్నులభారము మోయలేకుండ ఉండే ప్రజలతరపున ఎవరైతే ఉన్నారో వారందరు తెలంగాణ నుంచే ఎన్నుకోబడినవారు గనుక, వారు అందరిమీద యీ పన్నులు యికమీదట ఎక్కువచేయకుండా చూసేబాధ్యత ఉన్నదని గుర్తించాలి. Irratinal basis మీద కాకుండా, rational basis మీద పన్నులు వేయండి ఈ రోజున ఎక్కడెక్కడైతే అవకతవకగా పన్నులు ఉంటున్నవో, అవి ఎన్నడో ఏ కాలము లోనో విధించిన పన్నులు గనుక, ఆ విధానములో మార్పులు చేయండి అలా చేయకుండా యీ రోజున మాకు డబ్బులేదు, డబ్బు కావాలని surcharge క్రింద రూపాయకు అణా, రెండుఅణాలు, మూడు అణాలు యీ విధముగా హెచ్చుచేయటానికి యీ Surcharge Bill ను తీసుకుని వచ్చాము అని చెప్పి బిల్లును ప్రతిపాదించడము సమంజసమైన విషయము కాదు. కొద్దిరోజులలో

తెలంగాణకు Regional Council కూడ ఏర్పడబోతున్నది అలాంటి దాని కోసము వేచియుండకుండా యిప్పుడే యీ బిల్లులోనే అవసరమైన మార్పులు చేయండి అలా చేయకుండా యిప్పుడు యీ బిల్లును rush through చేయడము న్యాయముకాదు కాబట్టి నేనుకోరేది ఏమిటంటే, మీరు ఆ విధమైన మార్పులు చేయకుండా, యీ బిల్లును ప్రతిపాదించేటట్లైతే, దీన్ని మేము వ్యతిరేకిస్తున్నాము అలాంటి పరిస్థితి రాకుండా యీ బిల్లును యింతటితో ఆపి, దీనిని సెలెక్టుకమిటీకి పంపకుండా ముందుగా ప్రజల అభిప్రాయము సేకరించండి ప్రజల అభిప్రాయము ఏ విధముగ ఉన్నదో తెలుసుకోండి ఈలోగా కమిటీలను ఏర్పాటు చేయండి Regional Council త్వరలో ఏర్పడితే, Land Revenue Assessment అంతయు యిదివరకు ఉన్నది మార్చివేసి, దీనిని rational basis మీద పన్నులు వేయమని కోరుతున్నాను అంతేకాని, ఏదో దొడ్డిదారిన పన్నులు హెచ్చు చేయటానికి ప్రతిపాదించడము మంచిదికాదు

ఇక పోతే, తెలంగాణలో Agricultural Income Tax Act అమలులో ఉన్నది ఇప్పుడు తెచ్చిన ఈ Surcharge Bill ద్వారా, దానిని repeal చేయడము అవుతున్నది నేను చెప్పేది తెలంగాణలో ఎన్నడూకూడ Agricultural Income Tax కు fair trial యివ్వనేలేదు మొదటి సం ము పదకొండులక్షల రూపాయలు వసూలుచేశారు అప్పుడు ఒక పాలసీ ఉండేది అది ఎట్లాగని అంటే, తహశ్శీలు దారు వద్దకుపోయి, యీ తాలూకాలో పెద్దపెద్దవారు ఎవ్వరు ఉన్నారు. వారి income ఏమిటి అని అడిగేది, దానిపైన వారి యిష్టము ఉన్నవారికి తగ్గించి చెప్పేది, యిష్టములేనివారి మీద ఎక్కువ చెప్పేది. ఇక యీ విధముగా ఆయన యిష్టప్రకారము యీ Agricultural Income Taxవసూలుచేసేవారు తరువాత Sales Tax assess చేయడమునకు గూడ fair trial యివ్వలేదు అది యిచ్చియున్నట్లయితే చాలా పెద్ద మొత్తమే తెలంగాణ నుంచి వచ్చియుండేది. అలా చేయలేదు. మేము land reforms తెస్తున్నాము అవి కావాలి, ఇవి కావాలి అని అంటున్నారుగదా! అందువల్ల యిప్పుడు యీ Agricultural Income Tax ఎందుకు అని అనవచ్చును. కాని అది వచ్చినప్పుడు యిది automatic గా పోతుంది. కాని ఇప్పుడు తెలంగాణలో ఉండే Agricultural Income Tax Act అమలులో ఉన్నది గనుక, దీనిని యిప్పుడు ఖచ్చితముగ అమలుజరపవచ్చు. ఎంతో డబ్బు వసూలుఅవుతుంది ఏదో విధముగ దీనిని ఆంధ్రలో కూడ అమలు పరచేటట్లయితే చాలా పెద్దపెద్ద మొత్తములు యీ పద్ధతిద్వారా మంత్రిగారు ఎంత మొత్తము యీ Surcharge Bill ద్వారా రావాలని అనుకుంటున్నారో

అంత కాకపోయినను, అంతలో చాలా ఎక్కువభాగమే వసూలుఅయ్యే వీలు ఉన్నది అంతేకాకుండ యిక్కడ ఏదైనా కొంత exemption యివ్వడమువల్ల ఏమి అవుతుంది ? మొన్న మొన్నటి వరకు యీ assessment చేయడమే లేదు పూర్వపు రేట్ల మీదనే వసూలుచేస్తున్నారు తెలంగాణలో ఎవరైతే పెద్ద పెద్ద భూస్వాములు, జమీందార్లుగా ఉన్నారో వారికే ఎక్కువ తరిభూములు ఉన్నవి ఒకవైపున వారికి యీవిధముగ exemption ద్వారా relief యిచ్చుకుంటూ పోతే, ఏదో కొద్దో గొప్పో డబ్బు వసూలుఅయ్యేది రాకుండాపోతున్నట్లే ఇక సామాన్య ప్రజానీకము మీద ఆవిధముగా exemption వల్ల పోయిన సొమ్ము వసూలుచేయాలనే ఉద్దేశ్యముతోనే ఇది చేస్తున్నట్లు కనబడుతున్నది ఈవిధముగ చేయడము సబబు కాదు న్యాయదృష్టితో వసూలుచేయమని ప్రభుత్వానికి చెబుతున్నాను ఈ పరిస్థితులన్నీ దృష్టిలో పెట్టుకుని ప్రభుత్వము యీనాడు తెచ్చిన యీ Surcharge Bill ను సెలెక్టుకమిటీకి పంపడము యింతటితో ఆపివేసి ముందు ప్రజాభిప్రాయము కొరకు పంపి, ప్రజల యొక్క ఉద్దేశ్యము ఏవిధముగా ఉన్నదో చూచి, అటుపిమ్మట బిల్లు తేవడము సమంజసముగ ఉంటుంది. అప్పుడు దానిని తెలంగాణాలో కూడ impose చేసినప్పటికినీ, ఆంధ్రప్రదేశ్ మొత్తము మీద వ్యతిరేకించేవారు వుండరు తెలంగాణకు Regional Councils వచ్చిన తరువాత, యింకా యితర కమిటీలు ఏవి అయితే అవసరమని చెబుతున్నారో, అవి ఏర్పడి, వాటి యొక్క అభిప్రాయము కూడ తీసుకుని, అటు తరువాత ప్రజాభిమతానుగుణ్యముగా ఒక సమగ్రమైన పన్నుల విధానము నిర్ణయించితే మంచిదని నాఅభిప్రాయము అంతేగాని యిప్పుడు యింత తొందరలో యీబిల్లును rush చేయడము న్యాయముకాదు 'లేదు, యీ మూడు బిల్లులను కూడ మేము ప్యాసుచేయించితీరుతాము, యిది జరగవలసిందే' నని ప్రభుత్వము అభిప్రాయమే గనుక అయితే, అది సరియైనపద్ధతి కాదు, సమంజసము కాదు. గనుక దీనిని మేము ప్రతిఘటించకతప్పదు. కాబట్టి దీన్ని మంత్రిగారు మరొక సారి ఆలోచించవలసిందిగా కోరుతూ సెలవుతీసుకుంటున్నాను.

*శ్రీ కె. వెంకటరావు . అధ్యక్షా ! ఇలాంటి బిల్లులు వచ్చినప్పుడు ఆ బిల్లులలో వున్నటువంటి విషయాలను గురించి చర్చించడం న్యాయం గాని ఎక్కువ కాలం అసలు పన్నుఅంటే యేమిటి, పన్నుల విధానం అంటే యేమిటి ? ప్రపంచంలో ఎలావుంది ? ఇండియాలో ఎలావుంది ? ఆంధ్రలో ఎలావుంది ? తెలంగాణాలో ఎలావుంది ? అనే అంశాల మీదనే ఎక్కువకాలం గడపడం జరిగింది కొంచెం హెచ్చు తక్కువగా యివ్వాళ మాట్లాడిన 16 మంది సభ్యులు అందరూ ఆ దృష్టిలోనే వెళ్లారు. కాని land మీద వేసిన

surcharge అవసరమా, లేదా, వేసినట్లయితే బిల్లులో వున్నటువంటి ముఖ్యమైన లోపాలు యేమిటి ? వాటిని ఎలా సవరించుకోవాలి అనే విషయాలపై దృష్టి కేంద్రీకరించలేదు నేను మళ్ళీ అదే చర్చలోకిపోతే, ఒకరు Tossig's Principle of Finance తీసుకువస్తే కాల్డార్సు proposals, Soviet Economist యొక్క proposals చదివితే, వాటికి వ్యతిరేకంగా నేను మరొకటి చదవడంవల్ల పరిపాలనకు గాని పన్నుల విధానానికి గాని ఏవిధంగానూ తోడ్పడదు అందుచేత పునాది సిద్ధంగా ఆలోచించినప్పటికీ కూడా ఒక విషయం గోచరిస్తుంది ఇంతకు పూర్వమే నేను మనవిచేశాను మనకు వచ్చినటువంటి వారసత్వం మనం అనుకునే రీతిగా ఆదర్శముగాలేదు అందుచేత దానిని మార్చుకుంటూ వెళ్ళాలి మార్చుకునే యత్నాలు చేసుకుంటున్నాం ఇంతవరకు కొన్ని చర్యలు జరిగాయి ముందు కొన్ని జరుగబోతున్నాయి సముద్రం కెరటాలు ఆగేదాకా King Canute వ్యవహారంవలె ఆలోచించినట్లయితే అదిమాత్రం న్యాయంకాదని మనవి చేస్తున్నాను తెలంగాణాలో కొన్ని కష్టాలున్నాయి అవతల ప్రాంతములో కొన్ని కష్టాలున్నాయి నా దృష్టిలో రెండూ ఒకటె కావడంవల్ల నాకు రెండు విభిన్నంగా గోచరించడంలేదు కాని ఒక విషయం మనవి చేస్తున్నాను ఒకవేళ విభిన్న దృష్టితో మనం ఆలోచించినప్పటికీ ఒక స్థితిని గోచరింప చేసుకోవలసిన అవసరం వున్నది ఇంతవరకూ మనం ఒక అంగీకారంమీద పనిచేస్తున్నాం. తెలంగాణా నుంచి వచ్చినటువంటి ఆదాయం తెలంగాణామీదే తప్పకుండా ఖర్చు పెట్టాలనే విధి, నియమం ఒకటి మనస్సులో పెట్టుకుని చర్చలు సాగాయి ఇవ్వాళ పరిస్థితి యేమిటి ? ఇవ్వాళ మంత్రివర్గం మీ అందరియొక్క కోర్కె మైన తెలంగాణాపై ఒక రూపాయిగాని ఒక పైసగాని పన్ను పడకుండా చేయవచ్చును అది కష్టతరమయిన విషయంకాదు తరువాత జరిగే విషయంకూడా ఆలోచించాలి తెలంగాణా యొక్క అభివృద్ధి ఎలా సాధించడం ? ఎక్కడ నుంచి పెట్టుబడి గాని ఆదాయము గాని వస్తుంది? అందువల్ల అనేకసార్లు సభముందర మనవి చేశాను ఇవ్వగలిగిన సామర్థ్యం వుందని ఒక thermometer పెట్టి కొలిచి ఆ test మీదే పన్ను వేస్తున్నాం అని చెప్పడం లేదు అది ప్రభుత్వపు claim కాదు. కాని దేశముయొక్క అభివృద్ధికోసము ఏదో కొంత లేనివాడుకూడా యిచ్చుకునే పరిస్థితి యీ దేశములో ఏర్పడకపోయినట్లయితే రాజ్యాంగం ముందరకు వెళ్ళడంగాని, రాజ్యాంగంలో ఆర్థిక సాంఘిక అభివృద్ధి జరగడంగాని సాధ్యపడే విషయం కాదని స్పష్టంగా తెలుసుకున్న తరువాత మళ్ళా అవే విమర్శలు పైకి తీసుకురావలసిన న్యాయంలేదని నా మొట్టమొదటి వాదన. రెండో విషయం శ్రీ నరసింగరావుగారు ఆఖరున మాట్లాడుతూ కొన్ని అంకెలు

చదివారు వారు చదివిన అన్ని అంకెలూ ఒప్పుకోడానికి వీలులేదు నా దగ్గర నున్న అంకెలతో తేడాలు కనిపిస్తున్నాయి కాని అవి నిజమే అనుకుందాము అయినప్పటికీ కూడా యివ్వాళ మన తెలంగాణాలో వ్యవహారం యేమి చేయాలి? ఒక తుంగభద్ర ప్రాజెక్టు ఆఖరు చేయడంతోటి, కట్టబోయే నాగార్జునసాగర ప్రాజెక్టుతోటి తెలంగాణాగాని ఆంధ్రప్రదేశ్ గాని సంతోషించి ఊరుకుంటే నేను అంగీకరించేవాడను కాని ఎన్నో విషయాలు అక్కడా యిక్కడా అమలులోకి రావాలి ఈ రెండింటినీ ముందుకు తీసుకువెళ్ళాలంటే పన్నులు వదిలిపెట్టి వ్యవహారం చేయడం ఏ రకంగా సాధ్యమవుతుందనే విషయం సభ్యులు ఆలోచించవలసిన ధర్మంకూడావుంది రెండో విమర్శ— "సరే పన్నులు వేయకతప్పదు ఆ వేయడంలో మేము చెప్పిన పద్ధతులు అవలంబించవలసినది" అని మా పార్టీకి కొన్ని ఆదర్శములున్నాయి మేము election manifesto లో చెప్పిన విషయాలున్నాయి మేము మొన్న మొన్ననే గత ఫిబ్రవరి నెలలో దేశంముందు ప్రవేశపెట్టి stupendous majority తో ప్రజలయొక్క ఆమోదం తెచ్చుకున్న మా రెండవ పంచవర్ష ప్రణాళిక వున్నది వీటన్నిటినీ దాటి, నేను చదువుకున్న Economics Book లో ఫలానా సంగతి వుంది. కనుక ఆరకంగానే నువ్వు నడిస్తే నడవాలి, లేకుంటే నేను ప్రతిఘటిస్తాను" అనే భావంతో మళ్ళా ఎన్నికలు వచ్చినప్పుడు అవతల చెప్పవచ్చుగాని పరిపాలనలో భాగస్వాములమైన మనమందరము ఒకే దృక్పథంతోటి యీ విషయాలను దృష్టిలోకి తెచ్చుకోవాలిగాని యింకోరకంగా చేయడానికి వీలులేదు ఈ సందర్భములో నేను సభ్యులకు చెప్పగలిగింది ఒకటే Water rate, dry rate మొదలగు భూమిమీద వేయవలసిన పన్నుల విధానమును విచారణ చేయడానికి ఒక సంఘాన్ని త్వరలో వేస్తామని యిదివరకే మనవి చేశాను. ఇక్కడ యీమాట అని, ఆఫీసుకు పోయి మా శక్రటరీలతోటి చర్చ చేసినప్పుడు యిది ఎంత ఘనమైన కార్యమో నాకు తెలిసినది మదరాసునుంచి వచ్చిన Board's Standing Orders రెండువేల కాగితాలుగల నాలుగు సంపుటాల సారాంశము బయటకు తీసుకువచ్చి ఇక్కడ 9 జిల్లాలలో, అక్కడున్న 11 జిల్లాలలో 40 సంవత్సరాలనుంచి settlement లో అవలంబించిన పద్ధతులు; యివన్నీ తీసుకుని ఒక సమగ్రమయిన basic reform తీసుకురావడానికి కృషిచేస్తేనేగాని యిది జరగదు. అదంతా పూర్తిచేసి దీనిని మొదలుపెట్టమని శ్రీ నరసింగరావుగారి వాదన ఈ మధ్యకాలంలో Rip Van Winkle వలె మనం నిద్రపోయేశక్తిని భగవంతుడు మనకు యివ్వలేదు. మనం మేలుకుని వున్నాం. మనరాజ్యం నడవాలి. ఇంకా ముందుకు నడవడం లేదని ఒకప్రక్క విమర్శచేస్తూ అలా నడిపించడానికి దోహదం యివ్వకుండా దానిని యింకా అరికట్టే మార్గములో

యివ్వాళ నిలుపుచేయవలసినదనే కోరిక న్యాయమైనది కాదని మనవి చేస్తున్నాను ఈ సందర్భంలో ప్రతిదానికి general principles మీద ఎక్కువ మాట్లాడినవారికి యిప్పుడు యేమి చెప్పగలను? ఆ principles ను చర్చించడానికిది debate కాదు, University Seminar కాదు ఈ బిల్లుకు సంబంధించినంతవరకు మొట్టమొదటే మనవి చేశాను పరిపాలన కోసమనీ, అభివృద్ధి కార్యక్రమాలకోసమనీ, మాకు డబ్బు కావాలి దేశంలో inflation కొంతవరకు వుంది, ఎక్కువవుతున్నది ఉన్నటువంటి యీ inflation ను wipe out చేయాలంటే రెండు మార్గాలున్నాయి ఒకటి taxes రెండోది investment ఎక్కువ మంది తెలియక యివ్వలేనివారు, యివ్వగలిగి యివ్వనివారు వుండడంవల్ల, కొంత యీ బిల్లువల్ల ఆ inflationary surplus ను బయటకు తీసుకువెళ్ళితేనే గాని యింకోమార్గం లేదు కనుక యిది అనివార్యము ఈ taxation ఏదో ఒక పద్ధతిమీద వేసుకొనడానికి మనం దోహదం చేసుకోకపోతే యింకోమార్గం లేదు, అని మనవి చేస్తున్నాను ఇంకో విమర్శ శ్రీ విశ్వేశ్వరరావుగారుచేశారు. 500 రూపాయలపైన 0-8-0 కాదు ఒకరూపాయి వేయాలన్నారు ఈ సందర్భంలో ఒక విషయం మనవి చేయాలి. ఎంతవేసినాసరే లక్షలమాట దేము ఙెరుగును, వేలుకూడా వచ్చేమార్గం లేదు నాకేమీ అభ్యంతరం లేదు వారిమీద నాకేమీ ప్రేమలేదు. ఒకరిమీద వేసి యింకొకరిమీద తగ్గించేటటువంటి ఉద్దేశ్యం నా మనస్సులో లేదు తెనాలి తాలూకాలో గతసంవత్సరం surcharge అనుభవం వుంది ఆంధ్రరాష్ట్రంలో మంచి వ్యవసాయం గల 17 డెల్టా తాలూకాలలో తెనాలి తాలూకా ఒకటి అక్కడ 500 రూపాయల పన్నుపైన రూపాయికి 0-8-0 చొప్పున 5 గురు యిచ్చారు మిగతా 16 ప్రాంతాలలో దీనినిబట్టి గుణించుకుంటే ఎంతమంది వస్తారు? రూపాయికి 1½ కాదు, 5 రూపాయలు వేసినా వచ్చే ఆదాయం ఎంతవుతుంది? పోనీ అవసరం వచ్చినప్పుడు వేద్దాం, 50 రూపాయలకు తగ్గించమంటే old surcharge ప్రకారం 60 లక్షల రూపాయలు వచ్చినా అనుకున్న ప్రకారం వస్తే 23, 24 లక్షలకంటె రాదనుకుంటాను 50 రూపాయలకు exemption యిచ్చి 500 రూపాయలుపై వారిమీద rates ఎక్కువచేయడంవల్ల 15 లక్షలుకూడారావు ఇది తగ్గిపోతుంది అనుకున్నటువంటి విధానానికి యీ రెండు పద్ధతులు ఏరకంగామూ లాభించవని గుర్తించవలసిన న్యాయం వున్నది. తెలంగాణాలో ఎగ్రికల్చరల్ ఇన్‌కంటాక్సు తీయటంలో పరిపాలనా సౌలభ్యం లేకపోయిందనే విమర్శవచ్చింది. గతసంవత్సరం 2 వేల accounts విచారణచేయటం జరిగింది.

దాని ప్రకారమే ఇది వచ్చింది ఇప్పుడు దానికంటే ఎన్నో రెట్లు ఎక్కువ వస్తుందని ఆశించటానికి వీలులేదని మాత్రమే నేను మనవిచేస్తున్నాను

గుంటూరు జిల్లాలో dry lands కు 10 రు లు వుందని, అది ఎక్కువ అని శ్రీ గోపాలకృష్ణయ్యగారు చెప్పారు

శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్య నాల్గు రూపాయలని చెప్పాను

శ్రీ కె వెంకటరావు వారు రు 10-0-0 అని చెప్పారు అసలు రు 4-0-0 అయి వుండవచ్చు

వావిలాల గోపాలకృష్ణయ్య అది నేనుచెప్పినదికాదు మరొకరు చెప్పారు

శ్రీ కె వెంకటరావు, శ్రీ "వి గోపాలకృష్ణయ్యగారు 10-0-0" అని నేను ఇచట నోటు చేసుకొన్నాను నాచెవులైనా పాడై వుండాలి లేక వారు పొరబాటుగా నైనా చెప్పివుండాలి. ఎవరు చెప్పినా అది నిజంకాదు పడుగాయి రేటు రు 10-0-0 వుంది కాని గుంటూరు జిల్లాలో ఎక్కడా ఆ రేటు లేదు Highest dry rate తూర్పు గోదావరి జిల్లాలో రు 8-0-0 వుంది కాని అంతకంటే లేదు

శ్రీ పి నరసింగరావు · వారిచ్చిన రిపోర్టులోనే రు 10-0-0 అని వున్నది

శ్రీ కె. వెంకటరావు నేను చెప్పేది పూర్తిగా వినవలసిందిగా గౌరవ సభ్యులను కోరుతున్నాను పడుగాయి భూములకు అంటే గోదావరి రెండు గట్లకు ఒడ్డునవున్న భూమిని పడుగాయి అంటారు దానికి రు. 10-0-0 వుంది అది dry land కాదు.

శ్రీ పి నరసింగరావుగారు 'taxes only on incomes and not on land or water' అని అన్నారు. వారుఆ మెరికాలో పుట్టివుంటే బాగుండేది. Taxable income వున్న దేశములో అది పనికివస్తుంది. అణా, అర్ధణా, రూపాయి పన్ను ఇచ్చుకొనే దేశములో ఇది ప్రవేశపెడితే మొత్తం income అంతా పుచ్చుకొన్నా మన బడ్జెటులో అయిదోవంతుకూడా వసూలు కాదు

శ్రీ జగన్నాథరాజుగారు మాట్లాడుతూ రెవెన్యూమంత్రిగారు ఫైనాన్సు మంత్రిగారి చేతులలో పడిపోయారని చెప్పారు. కాని నేను ఆయన చేతులలో

కాని, ఆయన నాచేతిలోగాని పడలేదు ఇద్దరము ఒకే భావంతో ఒక పద్ధతిలో ఒకే మంత్రివర్గములో వుండి పనిచేస్తున్నాము మరో ఆశ్చర్యకరమైన విషయం ఒకటి చెప్పారు కాంగ్రెస్‌లో వున్న 'జింజర్ గ్రూపు' దీనిని ఆపుచెస్తుందని చెప్పారు జగన్నాధరాజుగారు వయో వృద్ధులు కనుక రాత్రితోపాటు పగలు కూడా వారికి కలలు వస్తున్నాయేమోనని నేను అనుకొంటున్నాను కాంగ్రెసులో 'జింజరు' అసలులేదు గ్రూపులేదు బేధాభిప్రాయాలు ప్రతివ్యక్తికి వుంటాయి కాంగ్రెసులో గ్రూపులులేవు ఒకే ఎలక్షన్ మానిఫెస్టో మీద మేము ఎన్నిక అయ్యాము ఒకే ఎలక్షన్ మానిఫెస్టో క్రింద అంతా కృషిచేస్తున్నాము

మిగిలిన సభ్యులందరు 'మాజిల్లాలో కొన్ని సౌకర్యాలు జరుగలేదు కనుక పన్నులు ఎలావేస్తారని' అడిగారు ఈ పన్నులు వేయటం ఒక జిల్లా సౌకర్యము, ఒక నియోజకవర్గ సౌకర్యము, ఒక వూరి సౌకర్యము ఉద్దేశించి చేసేవికావు మొత్తముమీద 20 జిల్లాలలోను అభివృద్ధి తీసుకురావటానికి ఇవి ఎలా ఉపయోగిస్తాయనే దృష్టితో ఆలోచించాలి. అందుచేత ఈ విమర్శనలను ఆలోచించవలసిన అవసరం లేదు

శ్రీ పి గోపాలురెడ్డిగారు మళ్ళీ రైలుబండిని వెనక్కు తిప్పారు **Progressive taxation** కు వ్యతిరేకంగా మాట్లాడారు. **Unifom rate** పెడితే **regressiven tax** అవుతుంది అంటే రు 5 లు ఆదాయమువచ్చేమనిషి ఏ పద్ధతిని రేటు చెల్లిస్తాడో, 5 కోట్ల ఆదాయం వచ్చేమనిషికి **proportion** గా అంతే అవుతుంది కాని అది **progression** అవదు ప్రపంచములో ఏ దేశము అంగీకరించని పరిస్థితి ఇది ఆయనతోపాటు మిగిలినవారు మోటారు బస్సులమీద పన్ను వేయండి అని చెప్పారు. ఇది సర్చార్జికి సంబంధించిన విషయముకాదు కనుక ఇప్పుడు సమాధానం చెప్పవలసిన అవసరము లేదని అనుకొంటున్నాను

ఒకేసెషన్‌లో 7 పన్నులు తీసుకువచ్చానని శ్రీ బసవ మానయ్యగారు అన్నారు 7 కాకపోతే 17 అయినా అవసరంవస్తే తీసుకురావాలి. మార్చి నెలలో బడ్జెటుసెషన్ జులైలో లెజిస్లేషన్ సెషన్, నవంబరు డిశంబరు నెలలలో టాక్సేషన్ సెషన్ జర్గుతుంది ఏడాదిలో ఇది తీసుకురాక తప్పదు. 7 పన్నులు వేశారనే విమర్శ వేరు.

రీజనల్ కౌన్సిల్‌ను అప్పగించకుండా ఎందుకు చేస్తారని నరసింహారావుగారు అడిగారు నిన్న పంజాబుది పడింది. నేడో, రేపో హైదరాబాద్‌ది వస్తుందని అనుకొంటున్నాను. దానికి ఇచ్చిన అధికారాలకు లోబడి మేము

ప్రపోజల్స్ పంపించక తప్పదు అది వచ్చేవరకు అట్టిపెట్టండి అని చెబితే, progression ఆగిపోతుంది కనుక అది న్యాయమైన విషయం కాదని మనవి చేస్తున్నాను ప్రతిదానికి తెలంగాణా అభిప్రాయముతో కొలుచుకోవటం మంచిదికాదు ఇది పార్టీలో ఆమోదించిన బిల్లు. రీజనల్ కౌన్సిల్‌కు వెళ్ళేది ఇది అక్కడనుండి భిన్నమైన అభిప్రాయము రాదు అందరము కలసి చేసిన విషయము కాబట్టి దీనిలో అభిప్రాయభేదాలను రేకెత్తించవలదని నేను సభ్యులకు మనవిచేస్తున్నాను

శ్రీ విశ్వేశ్వరరావుగారు 6 ఎకరాల dry land is excluded అని అన్నారు నేను చెప్పిన అంకెలు ఒకటి వారు చెప్పిన అంకెలు మరొకటి, రైతు, రైతు అని మాట్లాడేవారిని నేనొక విషయము ప్రశ్నిస్తున్నాను దేశములో రైతు వుండాలనే కోర్కె, సిద్ధాంతము వారికి ఉన్నదా ? Collective cultivation పెట్టి చేనంతా దున్ని వూరంతా ఒకటిచేరిచేస్తే అక్కడ పనిచేసేవారు రైతులు అవుతారా ? అని అడుగుతున్నాను. ఈ సిద్ధాంతము మీద వారికి నమ్మకము లేదు వారి పద్ధతి అంతావేరు అది న్యాయమై వుండవచ్చు ప్రపంచంలో ఏ మూడోవంతు భాగములోనయినా వారు చెప్పిన పద్ధతి అమలులో వుందేమో ! నేను dispute చేయటములేదు అది ఒక పద్ధతి అని ప్రచారము చేయటంలో న్యాయంవుంది కాని మా పద్ధతిలో వేలుపెట్టి తిరిగి తోడేయత్నం చేయటం వారికి న్యాయమైన విషయం కాదని నేను వారికి మనవి చేస్తున్నాను రైతులు అంటె ఎవరికి కోపములేదు ఈ house లో వున్నవారిలో 100కి 97 మంది రైతులే. అంతా స్వయంగా నాగలిపట్టుకొని దున్నేవారు కాకపోయినా పొలంమీదనుండి వచ్చే ఆదాయంతో బ్రతికేవారే ఈ పన్నులచేత effect కానివ్యక్తి హెచ్చుగా ఈ house లో వుండి వుండడు, అందుచేత ఇది మనం ఎరిగివుండి చేసేపనే మరల బైటయింకో ఎవరో రైతులు వున్నారని అనుకోవటంలో అర్థంలేదు. ఎక్కడైనా ప్రపంచంలో గ్రీకు సిటీ స్టేటు వెళ్ళిపోయిన తరువాత వెళ్లివున్న జనాన్ని ఒక చోట చేర్చి, ఈ పన్ను వేయమా ? వద్దా అని ఆలోచించే పరిస్థితి పోయింది ఇప్పుడు Representative Government వచ్చింది. మన రాష్ట్రంలోని 3,22,00,000 జనంలో 1,61,00,000 మందికి ఓట్లు వుండవచ్చును. ఇంతమంది ఒక చోట సమావేశమై ఈ పన్ను వేసుకోవాలా ? వద్దా ? అని చర్చించుకోటానికి వీలు లేదు కనుక, ప్రతి పన్నుమీద ప్లెబిసైటు గాని రిఫరెండము గాని తీసుకోటానికి వీలులేదు కనుక ఈ రిప్రజెంటేటివ్ డెమోక్రసీలో ఆ రకంగా పనిచేసే ఆస్కారం లేదు. రిప్రజెంటేటివ్ డెమోక్రసీ వున్న రోజుల్లో circulation for public

opinion అనేది rare commodity ఏదైనా basic change country లో వచ్చినప్పుడు circulation కు పంపించవచ్చును Lagislation కు పంపించవచ్చును

మన స్పీకరుగారు తెచ్చిన 'కట్నాలువద్దు' అనే బిల్లు అంతకుముందు 'బహుభార్యా వివాహ నిషేధ బిల్లు' ప్రజాభిప్రాయానికి పంపించారు కాని ఇలాంటి legislation ను public opinion కు పంపటం అనవసరము అందుచేత public opinion కొరకు circulation చేయాలి అని వచ్చిన motion ను withdraw చేసుకోమని నా మిత్రులను కోరుతూ, Select Committee వారు ఆలోచించి ఏమైనా మార్పులు తీసుకువస్తే, వాటినికూడా సభ్యులందరు ఆలోచించి ఆమోదించవలసిందిగా నేను కోరుతున్నాను

శ్రీ వి విశ్వేశ్వరరావు Personal explanation, Sir, మంత్రిగారు చెప్పినదాంట్లో నేను చెప్పిన విషయం ఎక్కడాలేదు అని చెప్పారు దానికి ఒక quotation యిస్తాను. Economics and Statistics Bulletin అనేది distribute చేశారు అందులో taxation విషయం చెప్పారు దాంట్లోంచి చదువుతున్నాను

"The maximum dry rates of assessment vary from Rs 10 per acre (Guntur District) to Rs. 2-8-0 per acre (Chittoor District), in Andhra."

శ్రీ కె. వెంకటరావు · నేను అందుకోసమే ఇది clarify చేశాను లంకలను కూడా rate, high అన్నారు. అయితే తూర్పు గోదావరి జిల్లాలో 14 ఉన్నది అది లెక్కకాదు. లంక మామూలు వ్యవసాయం dry rate అన్నప్పుడు wet rate అనే పదాలు మనం ఉపయోగించు కొన్నప్పుడు లంకలను exclude చేసి మిగిలినవి calculate చేసుకొంటాము. కనుక గోదావరి కృష్ణా నదీగర్భాలలో ఉన్న భూములను వదలిపెట్టి బహిరంగంగా వున్న ఎర్రనేల, నల్లనేల, పచ్చనేల అనే దానిని గురించి చెప్పాను, కాని నేను యింకో రకంగా చెప్పలేదు.

*Mr. Speaker*: I will now put the amendment of Sri V Visweswara Rao to the vote of the House.

The question is:

"That the Bill be circulated for the purpose of eliciting public opinion."

The motion was negatived.

*Sri P. Sundarayya (Gannavaram)*: Sir, I demand a division.

[The Division Bells were rung and counting was started. At this stage, Sri T. V. Raghavulu was seen entering the House.]

*Sri P Sundarayya* On a point of order, Sir The hon Member Sri T V Raghavulu is now entering the House

*Mr Speaker* When counting is being done, hon Members should not enter the House So, I request the hon Member Sri T V Raghavulu to withdraw from the House Then, Sri T V Raghavulu withdrew from the House

The House then divided

AYES 41 — NOES 78

The motion was negatived.

*Mr Speaker* Now, I put the main motion to the vote of the House The question is

"That the Andhra Pradesh Land Revenue (Surcharge) Bill, 1957, be refered to a Select Committee consisting of the following Members

1 Sri Kala Venkata Rao
2 Dr B Gopala Reddi
3 Sri R. Tirupati Rao
4. Sri K Vijayabhaskara Reddi.
5 Sri P V Narasimha Rao
6 Sri P Venkatasubbayya
7 Srimati Y Seethakumari
8 Sri J B Muthyal Rao
9 Sri Ranga Reddi (Balkonda)
10 Sri P Sundarayya
11 Sri G Yellamanda Reddi.
12. Sri C. Rajeswara Rao
13. Sri P. Narasinga Rao
14. Sri T Papa Rao
15. Sri P Sreeramulu.
16. Sri Krishnamachari."

The motion was adopted

*Mr. Speaker*. Under Rule 109 of the Assembly Rules, I appoint Sri K Venkata Rao, Minister for Revenue, as Chairman of the Committee. The House will now stand adjourned till 8-30 a. m. on Friday, the 8th November 1957.

*The House then adjourned till Half Past Eight of the Clock on Friday, the 8th November 1957.*